# ముఖచిత్రం



S. K. Sarkar

## చిత్రకారుని గురించి

యస్. కె. సర్కార్, 1967లో పశ్చిమ బెంగాల్, హుగ్లీ జిల్లా ఆరమ్‌బాగ్‌లో జన్మించారు. కలకత్తా విశ్వవిద్యాలయానికి అనుబంధమైన గవర్నమెంట్ ఆర్ట్ & క్రాఫ్ట్ కళాశాలలో చిత్రకళా లేఖనం (భారతీయ శైలి) లో పట్టం పుచ్చుకొన్నారు. తరవాత హైదరాబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయం నుంచి 1993 లో మాస్టరు డిగ్రీ (సృజనాత్మక) పుచ్చుకొన్నారు. రెండు సంవత్సరాల ప్రత్యేక ప్రాజెక్టును ఆచార్యలక్ష్మాగౌడ పర్యవేక్షణలో పూర్తిచేశాడు.

పెద్ద పెద్ద కళాఖండ ప్రదర్శన సంస్థలైన I.F.A.C.S. (న్యూఢిల్లీ),ఇండియన్ సొసైటీ ఆఫ్ ఓరియంటల్ ఆర్ట్ (కలకత్తా), ఇన్ఫర్మేషన్ సెంటర్ కలకత్తా, S.C.Z.C.C. నాగపూర్, ఆర్ట్ అసోషియన్ గిల్డ్ (హైదరాబాద్), హైదరాబాద్ ఆర్ట్ సొసైటీల నుంచి అవార్డులు అందుకొన్నారు

ఇటీవల, ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ కల్చరల్ రెలేషన్స్ (హైదరాబాద్ వారి ఆధ్వర్యంలో, ICCR ఆర్ట్ గాలరీ, కళాభవన్, సైఫాబాద్, హైదరాబాద్‌లో ఫిబ్రవరి 5 నుంచి 8 వరకు వీరి పెయింటింగ్స్), గ్రాఫిక్స్ ప్రదర్శన జరిగింది. ప్రస్తుతం వీరు S.V. College of Fine Arts హైదరాబాద్‌లో గ్రాఫిక్స్ లెక్చరరుగా పనిచేస్తున్నారు.

కళ సత్యాన్ని, అందాన్ని ఆవిష్కరిస్తుంది. అవిశ్రాంత సృజనాత్మక మనస్సుచేసే పని, సత్యాన్ని ఆవిష్కరింప జేసే ప్రకృతి అందాలను అన్వేషించడం ఆ మనస్సులో జనించే వాంఛ ప్రకృతి అందాలను గీతలకు కట్టి వేస్తుంది కళాకారుని అభి వ్యక్తక సంవేదనలు చిత్రాకాశం (pictorial space) మీద అనేక రూపాలు, ప్రతిమలు చిత్రించినప్పుడు అవి ఎన్నో చిత్త వృత్తులను దర్శింప జేస్తాయి S.K. సర్కార్‌ది అటువంటి ప్రజ్ఞాయుత సృజనాత్మక మనస్సు.

ముఖ్యంగా ఇతని చిత్రాలలో ఇతని జన్మస్థల స్మృతులు, బెంగాలు గ్రామీణ వాతావరణం దోబూచులాడుతూ కనిపిస్తాయి అంతేకాదు అతని కళలో జానపద కవిత, సంగీతాల నిశ్వాస కనిపిస్తుంది

అతనివి ఎక్కువగా తైలవర్ణ చిత్రాలు. ఆయన ఎంచుకొన్న ''వస్తువు''ల చిత్తవృత్తి, అభి వ్యక్తులను ఆయన ఎంచుకొన్న విస్పష్టవర్ణాలు విస్తృతీకరించి దర్శింప జేస్తాయి. ఆయన తెలుపు- నలుపు రేఖాచిత్రాలు విప్పారిన స్త్రీ ఆకృతులు స్వప్న లోకాలలోకి తీసుకువెళతాయి.

మిసిమి అట్టలనలంకరించిన **'గతం కోసం ఆక్రోశం', 'చీకటి నుంచి వెలుగుకు'** పై విషయాలను మీ ముందుంచుతాయి.

# మిసిమి

"All that we are is the product of what we have thought" is "We are what we think." - Dammapada.

సంపుటి 11 మార్చి 1999 సంచిక 3

వ్యవస్థాపక సంపాదకుడు : డాక్టర్ **రవీంద్రనాథ్ ఆలపాటి**

## విషయసూచిక




విడిప్రతి రూ. 8/- వార్షిక చందా రూ. 100/-

ముఖచిత్రం : **గతం కోసం ఆక్రోశం**

చిత్రకారుడు : యస్. కె. సర్కార్

Printed & Published by BAPANNA ALAPATI at Kala Jyothi Process Ltd.,
1-1-60/5, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 7645536
e-mail : misimi_m@hotmail.com
http : //www.misimi.com

సంపాదకుడు : **అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి**

# ఆధునికానంతరతా వాదం మీద చర్చకు ఆహ్వానం

సిద్ధాంతాలన్నీ ఎండువారిన ధూసరవర్ణరేఖలు జీవితం నవనవోన్మేషంగా పెరిగే పచ్చని వృక్షం ఎండు రేఖలకు ఆ పచ్చదనం ఎప్పుడూ చిక్కదు

★ ★ ★ ★ ★ ★

ఇరవయ్యో శతాబ్దాంతాన్ని ఒక ఊపు ఊపిందనుకొన్న వాదాలలో ఆధునికానంతరతా వాదం ఒకటి. ఇది ఇంకా ప్రబలంగానే ఉందని కొందరంటుంటే, కాదు కొడిగట్టిందని కొందరంటున్నారు దానికి అర్థం లేదన్నారు కొందరు దానికి పరమార్థం ఉందన్నారు మరి కొందరు అందుకని దీనిని చర్చించడం ఆవశ్యకమని భావిస్తున్నాం.

సత్యమా నీవెవరు? నీవు ఎలా ఉంటావు? నీవు ఒకటా, రెండా, బహుళమా? నీవు స్థిరమా? అస్థిరమా? ప్రవాహానివా? ఆత్మాశ్రయివా? వస్త్వాశ్రయివా? హేతు బద్ధివా? అహేతుబద్ధివా? ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పడానికి ఏండ్లు పూండ్లుగా దార్శనికులూ, శాస్త్రవేత్తలూ ప్రయత్నిస్తూనే ఉన్నారు ఇంతవరకు వారి ప్రయత్నాలు ఒక కొలిక్కి రాలేదు. బహుశా రావడానికి వీలు లేదేమో కూడ.

హేతుబద్ధమైంది, శాస్త్రబద్ధమైంది సత్యమని ఆధునికత వాదించింది. కాదు, శాస్త్రం, హేతువులు అందుకోలేని సత్యాలు కొన్ని ఉన్నాయి, అంటున్నది ఆధునికానంతరతా వాదం వ్యక్తి అనుభవాలు శాస్త్రచట్టంలో ఇమడనంతమాత్రాన అవి సత్యాలు కాకుండా పోవు వాటి విలువ వాటికి ఉన్నది. మరి ఎవరి సత్యం వారిదే. "Man is the measure of all things" అని హిరాక్లిటస్ చెప్పినట్లు చెబితే మనం ఊబిలో పడిపోమా? ఇదొక ఊబి అయితే శాస్త్రీయ సత్యం మరో ఊబి అవుతుంది. సత్యం ఈ రెండు ఊబుల సంయోగంలో ఉంటుంది లేదా ఆ సంయోగం వెలుపల ఉంటుంది ఆధునికతావాదం శాస్త్రీయ పద్ధతికి అంటి పెట్టుకొంటే, అదే సత్యమనుకొంటే, ఆధునికానంతరతా వాదం రెండో వైపుకు మొగ్గింది. పూర్వ నిర్దిష్ట ప్రమాణాలు లేవు, ఉన్నా, అవి నేటికి సరిపోవు. వాటిని తిప్పిరాసుకోవాలి. తిప్పిరాసుకొన్నా అవి మనలను గందరగోళం నుంచి బయట పడేస్తాయా అన్నది ప్రశ్నే.

ఏది ఏమైన ఆధునికానంతరతా వాదం ఎంత గందరగోళమైనదైనా దానికీ కొన్ని సామాన్య లక్షణాలుంటాయి కదా. వీటిని పట్టుకోగలిగితే ఈ వాదం కొంతవరకు అర్థం కావచ్చు.

సామాన్య లక్షణాలకంటె విశేష లక్షణాలే ఎక్కువగా ఉంటాయి. గనుక దానిని మనం అంత తేలికగా వివరించలేం

క్రమం (Order) లోనే కేవల సత్యంలేదు. క్రమరాహిత్యంలో గూడ సత్యం ఉంది. క్రమ రాహిత్యం మనకు బహుళంగా, అనిర్ధారణగా, అనిశ్చయంగా, రూపరాహిత్యంగా, ప్రవాహంగా, విరోధా భాసగా, అసమ్మతిగా, వేర్పాటుగా, పృథక్కరణగా, వికారంగా, కలగూరగంపగా, నూతన పోకడలుగా, చీలికదారులుగా, పగిలిన ముక్కలుగా, వికేంద్రీకరణ, బహుకేంద్రాభిసరణంగా, ఆకర్షణగా, ఫ్యాషన్గా, సనాతనకు విముఖంగా, ఉన్నదాని నుంచి విచలనంగా, వ్యక్తులు ద్వీపాలుగా, విభిన్నాలుగా, అసంగతత్వంగా కనిపిస్తున్నది.

ఇలాంటి పోస్టు మాడర్నిజం మీద డా॥ ఇన్నయ్యగారు రాసిన వ్యాసం ఈ సంచికలో వేస్తున్నాం. దీనిమీద చర్చ జరగాలని మిసిమి కోరుతోంది. పాఠకులు ప్రతిస్పందిస్తారని ఆశిస్తూ

– సంపాదకుడు.

# అవైదిక మతాలు, కుల వ్యవస్థపై
# డా॥ బి. ఎస్. ఎల్. హనుమంతరావు
# రచనలు - ఒక పరిశీలన

- టి. రవిచంద్

ఆచార్య బి ఎస్ ఎల్ హనుమంతరావు జూన్ 8, 1993న హఠాన్మరణం పొందారు. సెప్టెంబరు 1993 మిసిమి పత్రిక శ్రీ టి. రవిచంద్ వ్యాసం "సుప్రసిద్ధ చరిత్రకారుడు డా॥ బి ఎస్ ఎల్. హనుమంతరావు'' ప్రచురించింది ఆ వ్యాసం మేధావి వర్గంలో ఆసక్తిని రేకెత్తించింది, వారి అముద్రిత రచనల ప్రచురణకు ప్రేరణ కలిగించింది అనడం అతిశయోక్తి కాదు. అచిరకాలంలోనే తెలుగు విశ్వవిద్యాలయం, ఆనంద బుద్ధ విహారట్రస్టు, విశాలాంధ్ర ప్రచురణాలయం, తెలుగు అకాడమీ లాంటి సంస్థలు వారి అముద్రిత రచనలలో ముఖ్యమైనవాటిని ప్రచురించాయి ఆ రచనల వెలుగులో శ్రీ రవిచంద్ తన వ్యాసాన్ని పునః సమీక్షించారు

ఆంధ్రుల చరిత్రను, సంస్కృతిని శాస్త్రీయ దృష్టితో, మానవతాదృక్పథంతో పరిశోధన చేసిన ఆంధ్ర చరిత్రకారులలో డా॥ బి ఎస్ ఎల్ హనుమంతరావు సుప్రసిద్ధులు ''తారీఖులు, దస్తావేజులు ఇవికాదోయ్ చరిత్రసారం'' అన్నట్టు ఆంధ్రుల చరిత్ర రచనలో, పరిశోధనలో సాంస్కృతిక, రాజకీయ, ధార్మిక, మత విషయాలకు ప్రాముఖ్యం ఇవ్వాలని అప్పుడే అది చరిత్ర రచన అవుతుందని భావించిన శాస్త్రీయ చరిత్రకారులలో ఆయన ప్రత్యేకస్థానం ఆక్రమిస్తారు ''చరిత్ర కేవలం రాజకీయ సంఘటనల పట్టికకాదు భిన్నరంగాలలో మానవకృషి, ఆ కృషి ఫలితంగా మానవ జీవితంలో, దృక్పథంలోవచ్చిన పరిణామాలు అంటే నాగరికతా, సంస్కృతుల కథనం'' అని చరిత్రను వ్యాఖ్యానించారు చివరిక్షణం వరకు తాను సత్యమని నమ్మిన చారిత్రక యదార్థాలను తన రచనల ద్వారా నిర్మొహమాటంగా వెల్లడించిన ధైర్యశాలి ఆయన 1946వ సంవత్సరం నుంచి వివిధ విద్యాలయాల్లో, హైస్కూలు టీచర్‌గా (కూచిపూడి హైస్కూలు), కళాశాల అధ్యాపకుడిగా (గుంటూరు హిందూ కళాశాల), విశ్వ విద్యాలయంలో ప్రొఫెసర్‌గా (నాగార్జున విశ్వవిద్యాలయం) పనిచేసిన డా॥ బి. ఎస్. ఎల్ హనుమంతరావు చరిత్ర బోధనలో, రచనలో, పరిశోధనలో లౌకికవాదిగా, మానవవాదిగా తనదైన ప్రత్యేక వ్యక్తిత్వాన్ని నిలుపుకొన్నారు అనర్గళం, అనితర సాధ్యం నా మార్గం అనిపించుకున్నారు నిజానికి సమకాలిక ఆంధ్ర చరిత్రకారులలో అరుదైన వ్యక్తిత్వం ఆయనది.

శాస్త్రీయ దృక్పథంతో విమర్శనాత్మక దృష్టితో కుల, మత సమస్యల్ని తీవ్ర సమస్యలుగా పరిగణించటమే గాక, వాటిని మూలం నుండి పరిశోధన చేసినవారు ఆంధ్ర చరిత్రకారులలో మరొకరు లేరంటే అతిశయోక్తి కాదు. కేవలం ప్రచారం కోసమో, లేక ఏదో ఒక కులం పైనో, వర్గం పైనో కోపంతో కుల- మత సమస్యల్ని విమర్శించలేదు. నిజమైన మానవతావాదిగా వర్గ, ప్రాంతీయ పరిధులుదాటి మానవ వ్యక్తిత్వం ఎదగాలని ఆకాంక్షించిన మానవవాద చరిత్రకారుడు డా॥ బి. ఎస్. ఎల్. హనుమంతరావు ఆయన చరిత్రకారుడు మాత్రమే కాదు, సాహిత్యవేత్త, ఉత్తమ అనువాదకుడు. తెలుగు భాషా సాహిత్యాలలో లోతైన కృషిచేశారు. ఆ సాహిత్య పరిజ్ఞానాన్ని, పాండిత్యాన్ని చరిత్ర రచనకు సాధనంగా ఉపయోగించుకున్నారు. ఆంధ్రుల చరిత్రపై ఆయన రచనకేవలం చరిత్ర గ్రంథంగానే కాకుండా సాహిత్య

గ్రంథంగా కూడా కొనియాడబడింది అందువల్లనే క్షేత్రయ్య, రామదాసు, వేమనల కవిత్వాన్ని గురించి ఇలా అనగలిగారు ''క్షేత్రయ్యలో పచ్చి శృంగారానికి, రామదాసులో భక్తి పారవశ్యానికి సాధనమైన కవిత్వం వేమనలో నీతి బోధకు, సంఘ సంస్కార ప్రబోధానికి సాధనమయింది''[1] ఆయన చరిత్ర రచనల్లో పేర్కొనతగినవి (1) Religion in Andhra (ఆంధ్రలో మతం) (2) Buddhism and Jainism in Andhra (ఆంధ్రలో బౌద్ధం - జైనం) (3) Buddhist Inscriptions of Andhra (ఆంధ్రదేశంలోని బౌద్ధ శాసనాలు) (4) Socio-Cultural History of Ancient and Medieval Andhra (ప్రాచీన మధ్యయుగ ఆంధ్రలో సామాజిక సాంస్కృతిక చరిత్ర) (5) Social Mobility in Medieval Andhra (మధ్యయుగ ఆంధ్రలో సామాజిక చలనం) (6) The Age of Satavahanas (శాతవాహన యుగం) (7) Indian History and Culture (భారతీయ చరిత్ర - సంస్కృతి) (8) Guntur Through Ages (యుగ యుగాల్లో గుంటూరు) (9) Srisailam - It's History and Culture (శ్రీశైలం - చరిత్ర సంస్కృతి) (10) ఆంధ్రుల చరిత్ర (11) ఆంధ్ర దేశంలో బౌద్ధ, జైన మతాలు (12) బౌద్ధము - ఆంధ్రము (13) భారతీయ సంస్కృతి - ఒక పరిశీలన. ఇంకా అసంఖ్యాకమైన రేడియో ప్రసంగాలు, వివిధ పత్రికల్లో ప్రచురించబడిన తెలుగు, ఆంగ్ల వ్యాసాలు, వివిధ సభల్లో చేసిన ప్రసంగాలు ఉన్నాయి ఆయన ప్రసంగ వ్యాసాల్లో ప్రత్యేకంగా పేర్కొనవలసినవి సమకాలిక ప్రాధాన్యత కలిగినవి రెండు ఉన్నాయి అవి (1) Formation of Social Groups and Mutual Relations in Andhra[2] (సామాజిక సమూహాల ఆవిర్భావం - ఆంధ్రలో వాటి పరస్పర సంబంధం). (2) భారతదేశంలో కుల వ్యవస్థ-పుట్టు పూర్వోత్తరాలు[3] ఈ రచనల్లో డా॥ బి.ఎస్ ఎల్ హనుమంతరావు సత్యాన్వేషణా దృష్టి, మానవతా దృక్పథం ప్రస్ఫుటంగా వ్యక్తమవుతుంది.

ఆంధ్ర దేశంలో బౌద్ధ శాసనాలు[4] అనే ఆంగ్ల గ్రంథం డా॥ బి ఎస్. ఎల్. అకాలమరణం వల్ల అసంపూర్తిగా మిగిలిపోయింది ఆయన మరణించేనాటికి 12 బౌద్ధ క్షేత్రాలకు సంబంధించిన శాసన సమాచారం సేకరించారు ఈ గ్రంథం మొత్తం ఆయనే పూర్తి చేసినట్లయితే ఆంధ్రదేశంలో బౌద్ధ సాహిత్యాభిమానులకు పరిశోధకులకు బౌద్ధానికి సంబంధించిన శాసనాధారాలు విమర్శనాత్మక విశ్లేషణతో అందినట్లయ్యేది.

డా॥ బి ఎస్ ఎల్. మరణించిన ఐదు సంవత్సరాలలో ఆయన ప్రధాన అముద్రిత రచనలన్నింటిని, ఆంధ్రదేశంలోని వివిధ రంగాలకు చెందిన బి ఎస్ ఎల్ హనుమంతరావు అభిమానులు, అనుచరుల ప్రోత్సాహ, ప్రోద్బలాలతో వివిధ సంస్థలు ప్రచురించాయి ఇది సామాన్యమైన విషయంకాదు ఆయన రచనల్ని సాంప్రదాయక హిందూ సమాజం అంగీకరించలేదు. ఆయన మతాన్ని, దానితోపాటు అనాగరికమైన ఆటవిక కులవ్యవస్థను నిశితంగా విమర్శించారు. ఆయన ఏ కులంలో జన్మించారో, ఆ కులం యుగ యుగాలుగా ఎలా పరిణామంచెందుతూ వచ్చిందో నిష్పాక్షికంగా చారిత్రక విశ్లేషణచేసి నిరూపించారు.[5] బ్రాహ్మణులతో సహా ఆంధ్రదేశంలోని అన్ని కులాలు సామాజిక ఊర్ధ్వ చలనం ద్వారా వర్ణ వ్యవస్థలో, స్థానం పొందిన వారేనని చెప్పి అగ్ర వర్ణాల, అగ్రకులాల అహంకారంపై చావుదెబ్బ కొట్టారు. జన్మతః మేము అగ్రవర్ణాల వారం, అగ్రకులాల వారమని విర్రవీగే వారందరి పుట్టు

పూర్వోత్తరాలు వెలికితీసి (ప్రామాణిక ఆధారాలతో) వారి గుట్టు రట్టు చేశారు ఆంధ్రదేశంలోని అన్ని కులాలలో సామాజిక ఊర్ధ్వ చలనంలో భాగంగా ఆటవిక జాతుల వారు చేరిపోయారని 'ఆంధ్రదేశంలో బోయలు' అనే వ్యాసంలో శాసనాధారాలతో, సాహిత్యాధారాలతో నిరూపించారు.[6] ఇటువంటి చారిత్రక పరిశోధనను గత చరిత్రకారులెవరు ఆంధ్రదేశంలో సమగ్రంగా చేయలేదు బి ఎస్ ఎల్ కు ముందు చిలుకూరి వీరభద్రరావు, సురవరం ప్రతాపరెడ్డి కొంతవరకు కృషిచేశారు. 'ఆటవికులైన బోయవారు సంస్కృతీకరణ ప్రభావంతో బ్రాహ్మణులై ఉంటారని' అభిప్రాయపడ్డారు చిలుకూరి వీరభద్రరావు తరువాత సురవరం ప్రతాపరెడ్డి 'హిందువులలో ప్రతిశాఖలోను కులాల మార్పులు జరుగుచు వచ్చెను' అని రాశారు వీరిద్దరి తర్వాత ఈ విషయంపై ఆంధ్ర చరిత్రకారులలో మరొకరు ఇటువంటి లోతైన పరిశోధనచేయలేదు. చిలుకూరి వీరభద్రరావు, సురవరం ప్రతాపరెడ్డిలు సత్యాన్వేషణాదృష్టితో చరిత్ర రచనచేశారు బి ఎస్ ఎల్ హనుమంతరావు చరిత్ర అధ్యయన, అధ్యాపనాలే ఉచ్ఛ్వాస, నిశ్వాసాలుగా జీవించినా, ఆయనకొక నిర్దిష్టమైన సామాజిక దృక్పథం ఉంది. అందువల్ల ఆంధ్ర చరిత్రకారులలో బి ఎస్ ఎల్ హనుమంతరావుకి విశిష్టస్థానం ఏర్పడింది. ఆయన పరిశోధనకు ప్రత్యేకత వచ్చింది.

ఆంధ్రదేశంలోని ప్రతివర్ణానికి, ప్రతి కులానికి తమ ప్రాచీనతను, పవిత్రతను వేదాలవరకు పొడగించుకొనే దురభిమానం, దురహంకారం చాలా ఎక్కువ. అంతేకాదు ప్రతివర్ణం, ప్రతికులం ఆర్థికంగా, రాజకీయంగా కొంచెం ఉన్నతస్థితికి రాగానే, తామేదో ఆకాశం నుండి ఊడి పడ్డట్టుగా భ్రమలకు లోనయి దురహంకారపూరితమైన 'కులచరిత్రలు' రాసుకొంటున్నారు అనుకరణ అంటుజాడ్యంలా వ్యాపించి, స్వాతిశయభావంతో కులచరిత్రల పేరుతో కొత్త పురాణాల్ని, కట్టుకథల్ని ప్రచారం చేసుకొంటూ, సామాజిక అసమానత్వానికి ఆంధ్రదేశంలోని ప్రతివర్ణం, ప్రతికులం కారణభూతమౌతోంది. ఇటువంటి పరిస్థితులలో చారిత్రక సత్యాన్ని స్పష్టంగా చెప్పిన ధీరునికి ఆంధ్రదేశం ఎంతయినా రుణపడి ఉంది అనడంలో ఎటువంటి అతిశయోక్తి లేదు

బి.ఎస్.ఎల్. హనుమంతరావుకి భారతదేశ చరిత్రలో అభిమాన పాత్రమైన విషయాలు అవైదిక దర్శనాలు, మతాలు. ఆయనకు అయిష్టమైనవి సంకుచిత కుల, మత వ్యవస్థలు ఆయన పరిశోధనంతా ఈ విషయాలచుట్టూ పరిభ్రమిస్తుంటుంది ఆయన రచనలన్నీ భారత దేశచరిత్రలో మరీ ముఖ్యంగా ఆంధ్రదేశ చరిత్రలో అవైదిక మతాలైన బౌద్ధ, జైనాలు నిర్వహించిన చారిత్రక పాత్రను విశ్లేషించేవే. ఆటవికులైన ఆంధ్రులను నాగరిక జాతిగా రూపొందించడంలో అవైదిక మతాల ప్రభావం ఏవిధంగా దోహదపడిందో ఆయన తమ రచనలద్వారా నిరూపించారు. వైదిక, బ్రాహ్మణ సాహిత్యంలో మ్లేచ్ఛదేశంగా, అనార్యదేశంగా పేర్కొనబడ్డ ఆంధ్రలో అవైదిక మతాలు ఎటువంటి నాగరిక విప్లవానికి కారణమయ్యాయో, అదే సమయంలో బ్రాహ్మణ మత ప్రతిరూపాలైన వర్ణవ్యవస్థ, కులవ్యవస్థ ఆ నాగరిక విప్లవాన్ని ఎలా విచ్ఛిన్నం చేసింది ఆయన తమ రచనల్లో ప్రామాణికంగా నిరూపించారు.

కర్ణాటక విశ్వవిద్యాలయానికి పి.హెచ్.డి. డిగ్రీ కొరకు 1969-70 సంవత్సరాల్లో సమర్పించిన సిద్ధాంత వ్యాసమే ''రెలిజియన్ ఇన్ ఆంధ్ర'' (ఆంధ్రలో మతం) అనే గ్రంథం దీనిలో అతి ప్రాచీనకాలం నుంచి క్రీ.శ. 1325 వరకు ఆంధ్ర దేశంలో సంభవించిన మతపరిణామాల్ని అవలోకనం **(Survey)** చేశారు ఆర్య వాఙ్మయంలో, బ్రాహ్మణ సాహిత్యంలో అనార్య దేశంగా, మ్లేచ్ఛ దేశంగా

పరిగణింపబడ్డ ఆంధ్ర దేశంలోకి ప్రవేశించిన బ్రాహ్మణ మతం, బౌద్ధం, జైనం, హిందూ మతాల గూర్చి లోతైన అధ్యయనం దీనిలో కనిపిస్తుంది ప్రజా ఉద్యమాలుగా విస్తరిల్లిన బౌద్ధ, జైన మతాలు ఆంధ్ర ప్రజాజీవితంపై కలిగించిన ప్రభావాన్ని గూర్చి సాధికారకమైన విశేషకృషి ఈ గ్రంథంలో ప్రస్ఫుటమౌతుంది బౌద్ధ, జైన ధర్మాల గూర్చి ఈ గ్రంథంలో డా॥ బి ఎస్ ఎల్. వెల్లడించిన అనేక చారిత్రక వాస్తవాల వలన దీనికి పండితలోకంలో విశేషమైన ఖ్యాతి లభించింది జీన్ ఫిలియో జాట్, వి వి గోఖలే, జి ఎస్. దీక్షిత్, ప్రొఫెసర్ కొత్త సచ్చిదానందమూర్తి వంటి భిన్న శాఖలకు చెందిన పండితుల, మేధావుల ప్రశంసలని ఈ గ్రంథం పొందింది ఈ గ్రంథాన్ని గూర్చి ప్రొఫెసర్ జి ఎస్. దీక్షిత్ ఇలా అన్నారు: '' ఆంధ్రలో బౌద్ధమతం పుట్టుక, పెరుగుదల, పతనాల గూర్చి డా॥ హనుమంతరావు చేసిన పునర్నిర్మాణం చాలా గొప్ప ప్రశంసకు తగియున్నది. బౌద్ధ ధర్మ అధ్యయనం అనేది అంతర్జాతీయంగా ఆసక్తి కలిగిన విషయం కాబట్టి ఆయన రచనలో ఈ భాగం ( బుక్ II) భారతదేశానికి అవతల ( విదేశాల్లో) కూడ ఆసక్తి రేకెత్తిస్తుందని ఆశించవచ్చు.'' అదే విధంగా ప్రొఫెసర్ కె. సచ్చిదానందమూర్తి బౌద్ధమతంపై ఉన్న ఈ భాగాన్ని ప్రత్యేకంగా ప్రశంసించారు ''బి ఎస్ ఎల్ హనుమంతరావు రాసిన 'రెలిజియన్ ఇన్ ఆంధ్ర' ( బుక్ - II) అనే గ్రంథం అతి ప్రాచీనకాలం నుంచి క్రీ.శ. 1325 వరకు ఆంధ్రదేశంలోని బౌద్ధ మతాన్ని గూర్చి చాలచక్కగా రాసిన ఉత్తమగ్రంథం '' ఈ విధంగా పలువురి ప్రశంసలను పొందిన ఈ పరిశోధనా గ్రంథం సత్యదృష్టిగల పాఠకులకు, పరిశోధకులకు నాటికీ, నేటికీ అంతే ఆసక్తిని కలిగిస్తోంది

గ్రంథ ప్రారంభంలో ఆంధ్రలోని మత పరిణామాలకి ఉపోద్ఘాతంగా రచయిత చారిత్రక ఆధారాలు, వాఙ్మయాధారాలు, పురావస్తు ఆధారాలు, భౌగోళిక వివరాలు, ఆంధ్రుల తొలి విశ్వాసాలు - ఆచారాలు, బ్రాహ్మణ మతప్రచారం, బ్రాహ్మణ మతంపై అసంతృప్తి, ఆందోళనలాంటివి వివరించారు. ఈ ఉపోద్ఘాతంలో ఆయన ఒక ఆసక్తికరమయిన అంశాన్ని ప్రస్తావించారు. బౌధాయన ధర్మ సూత్రంలో ఆర్యావర్తానికి అవతలవున్న దేశంలో చాతుర్వర్ణ వ్యవస్థ తెలియదని, అది మ్లేచ్ఛ దేశమని పేర్కొన్నట్టు ఒక శ్లోకాన్ని ఉదహరించారు. ( చాతుర్వర్ణ్య వ్యవస్థానామ్ యస్మిన్ దేశేనవిద్యతే తమ్ మ్లేచ్ఛ విషయం ప్రాహు దార్యావర్తా దనంతరం, x,43)[7]. చాతుర్వర్ణం తెలియని ప్రాంతాన్ని మ్లేచ్ఛదేశంగా మన స్మృతికారులు పరిగణించినట్టు తెలుస్తుంది. మ్లేచ్ఛుడంటే అంటరానివాడనే అభిప్రాయం చదువుకున్న వారిలోనే చాలా ప్రబలంగా ఉంది ఆ అభిప్రాయం తప్పని ఈ శ్లోకం నిరూపిస్తుంది. మ్లేచ్ఛుడు, శూద్రుడు అనే పదాలకు నిజమైన అర్థం తెలియని వాళ్ళుకూడా ఇరవైసంవత్సరాలుగా అధ్యాపకులుగా పనిచేస్తున్నారని ఆయన ఒక సభలో ప్రసంగిస్తూ బాధపడ్డారు. మన చరిత్రగూర్చి చరిత్రను బోధించే అధ్యాపకులకే సరియైన అవగాహన లేదని ఆయన ఆవేదన.

ఆర్యీకరణలో భాగంగా బ్రాహ్మణవర్గం స్థానికులైన ఆటవిక జాతులవారిని (ఎబోరిజినల్స్) చాతుర్వర్ణ వ్యవస్థలో చేర్చుకున్నది. తొలిదశలో ఆర్య సంస్కృతిని ఆమోదించిన వారిని వర్ణవ్యవస్థలోని వారి స్థానిక స్థాయినిబట్టి ఏదో ఒక వర్ణంలోకి చేర్చుకున్నారు స్థానికుడైన పురోహితుణ్ణి బ్రాహ్మణుడిస్థాయికి, స్థానిక రాజుని క్షత్రియుడి స్థాయికి బ్రాహ్మణవర్గం చేర్చుకుంది. అందువల్ల అన్ని వర్గాలలోకి స్థానిక ఆటవిక జాతుల వారు చేరిపోయారు. దీనివలన జన్మతః బ్రాహ్మణుడు,

క్షత్రియుడు, వైశ్యుడు, శూద్రుడు అనే విభజన అర్ధరహితమని తేలుతుంది. కాబట్టి ''బ్రాహ్మణులు పవిత్రులు కాదు, శూద్రులు అపవిత్రులుకాదు'' అనే చారిత్రక సత్యాన్ని ఆయన ''రెలిజియన్ ఇన్ ఆంధ్ర'' (1970) నుంచి ''భారతదేశంలో కులాలు - పుట్టు పూర్వోత్తరాలు'' (1992) అనే ప్రసంగ వ్యాసం వరకు పదేపదే చెబుతూ వచ్చారు. వర్ణవ్యవస్థ పవిత్రతను, శాస్త్రీయతను పటాపంచలు చేశారు. వర్ణవ్యవస్థ పునాదులకు వెళ్లి పరిశీలించి విశ్లేషించి చూస్తే ఈ విభేదాలు, భేషజాలు, పట్టింపులు, వైషమ్యాలు అర్ధరహితమని అది కూకటి వేళ్ళతో కూలిపోతుందని ఆయన ప్రగాఢంగా విశ్వసించారు.

ఉత్తర భారతంనుంచి దక్షిణ భారతదేశానికి బ్రాహ్మణమతం ప్రవేశించిన తర్వాత ఆర్యీకరణ జరిగింది ఉత్తర భారత ప్రభావానికి గురయిన దక్షిణాది రాష్ట్రాల్లో ఆంధ్రదేశం మొదటిది అందువల్లనే ఆంధ్రరాష్ట్రం ఉత్తర భారత సంస్కృతికి, దక్షిణ భారత సంస్కృతికి ( ఆర్య- ద్రావిడ సంస్కృతులకు) కేంద్రస్థానమయింది ఆంధ్రదేశంలో బ్రాహ్మణ మతం పురోగమించి, స్థిరపడిన తర్వాత బౌధాయన, ఆపస్తంబులు దక్షిణ భారతంలోనే ధర్మ సూత్రాలు రచించారు వీరిలో ఆపస్తంబుడు ఆంధ్రుడనే అభిప్రాయం బలీయంగా ఉంది ''హిస్టరీ ఆఫ్ ధర్మశాస్త్ర'' రచించిన పి వి కానె ఆపస్తంబశాఖ దక్షిణా పధంలోనే పుట్టిందని, బహుశా ఆంధ్రదేశమే దాని జన్మస్థలమని అభిప్రాయపడ్డాడు ఈ విధంగా ఆంధ్రలో ప్రచారమై బలపడ్డ బ్రాహ్మణ మతంపై ఉత్తర భారతంలో పెరిగినట్లే అసంతృప్తి పెరిగింది ఉత్తర భారతదేశంలో క్రీ పూ 6వ శతాబ్దం ఆధ్యాత్మిక అసంతృప్తి (Spiritual Unrest) కాలంగా పరిగణించబడింది ఈ ఆధ్యాత్మిక అసంతృప్తి మనకు ఉపనిషత్తుల్లో, వివిధ దర్శనాల్లో ప్రతిబింబించింది ఈ అసంతృప్తిలో భాగంగా ప్రజలు వైదిక కర్మకాండని, వర్ణవ్యవస్థ ప్రామాణికతను, ఆధిక్యతను సందేహించడం, ప్రశ్నించడం ప్రారంభించారు దాని ప్రతిధ్వనులు ఆంధ్రదేశాన్ని తాకాయనడం ఏమాత్రం అహేతుకం కాదంటారు బి.ఎస్ ఎల్ మగధలో మాదిరి ఆంధ్రదేశంలో కూడా బ్రాహ్మణ మతాన్ని దానిలో అంతర్భాగమైన ఖరీదైన కర్మకాండని, వర్ణ వివక్షతల్ని అంగీకరించని, ఆమోదించని ప్రజలు ఉన్నారు. ముఖ్యంగా నాగ, యక్ష తెగలు బ్రాహ్మణ సామాజిక వ్యవస్థపై తిరుగుబాటు ప్రకటించారు అదేవిధంగా మేధారంగంలో కూడ అసంతృప్తి బయలుదేరింది ఈ ఆధ్యాత్మిక అసంతృప్తిని సుత్తనిపాత, మహావంశ, మజ్జిమనికాయిం వంటి బౌద్ధ గ్రంథాలు కథల రూపంలో గ్రంధస్థం చేశాయి మజ్జిమనికాయంలో కొష్టిలుడు అనే బ్రాహ్మణ పండితుని ఉదంతం ఉంది. దాని ప్రకారం - కొష్టిలుడు బుద్ధుడి ప్రధాన శిష్యుల్లో ఒకడైన సారిపుత్తుని మేనమామ బ్రాహ్మణమత సాహిత్యంలో గొప్ప పండితుడు కాని దక్షిణాపధంలో లోకాయత సిద్ధాంతాన్ని అధ్యయనం చేయడానికి వస్తాడు. ఈ ఉదంతంద్వారా రెండు విషయాలు విశదమవుతున్నాయంటారు డా॥ బి ఎస్ ఎల్ (1) కొష్టిలుడు ఉత్తర భారతదేశంలో బ్రాహ్మణ సాహిత్యంలో సంపాదించిన పాండిత్యంతో అసంతృప్తిచెందాడు (2) లోకాయతం వ్యవస్థీకృతమైన తొలిభారతీయ భౌతిక వాద చింతన అది దక్షిణ భారతదేశంలో విస్తృతమైన ప్రచారంలో ఉంది దక్షిణ భారతంలో కొష్టిలుడు దీర్ఘనఖ పేరుతో పరివ్రాజకుడిగా మారాడు దీర్ఘనఖ ఉదంతం ద్వారా పరివ్రాజకసాంప్రదాయం దక్షిణాపధంలో బాగా ప్రచారంలో ఉందని, బ్రాహ్మణ వాదానికి వ్యతిరేకంగా అసంతృప్తి తీవ్రమయిందని తెలుస్తోంది. ఈ నేపధ్యంలో బౌద్ధం దక్షిణాపధంలో ( ఆంధ్రలో) ప్రవేశించింది. అందువల్లనే డా॥ బి. ఎస్ ఎల్ హనుమంతరావు ఇలా అంటారు· "The discon-

tent against Brahmanical System formed the background for the rise and spread of Buddhism"[8] (బ్రాహ్మణమత వ్యతిరేక అసంతృప్తి బౌద్ధమతం ఉదయించటానికి, వ్యాపించటానికి నేపథ్యంగా రూపొందింది) ఆంధ్ర ప్రజల్ని ఆకర్షించిన మతం బౌద్ధం దాదాపు వెయ్యి సంవత్సరాల (క్రీ పూ 400 - క్రీ శ 600) ఆంధ్రదేశ చరిత్రలో ఘనమైన స్థానాన్ని పొందింది. ప్రజా ఉద్యమంగా, ప్రభంజనంగా వ్యాపించింది ఆంధ్రదేశంలో బౌద్ధమత వ్యాప్తిలో కనిపించే ఆసక్తికర పరిణామం, అది రాజాదరణ లేకుండా స్వతంత్రంగా ప్రజాభిమానంతో ప్రజా ఉద్యమంగా వ్యాపించటమేనంటారు డా॥ బి ఎస్ ఎల్ హనుమంతరావు నాటి శాసనాలవల్ల ఏ ఏ వర్గాలు విశేషంగా బౌద్ధాన్ని అభిమానించాయో తెలుస్తుంది బౌద్ధాన్ని పోషించింది, ఆదరించింది రాజ్యాధిపతులుకాదు, సామాన్య ప్రజలు, స్త్రీలు, చేతి పనివాళ్ళు, వ్యాపార వర్గాలు వీరి ఆదరణతో, బౌద్ధం మహోద్యమంగా విరాజిల్లింది ప్రజలు ఆశిస్తున్న నూతన సామాజిక నిర్మాణం - జాతి, మత, వర్ణ విభేదాలతో ప్రమేయంలేనిది - బౌద్ధంలో కన్పించడమే ఇంత విశేష ఆకర్షణకు కారణం. ఆటవిక తెగలలో, సామాజికంగా వెనుకబడిన వర్గాలలో సామాజిక ఊర్ధ్వ చలనానికి బౌద్ధం ఎంతో తోడ్పడింది. బౌద్ధం తర్వాత క్రీ శ. 6-7 శతాబ్దాలలో ఆంధ్రదేశంలో ప్రవేశించిన జైనం కూడ సామాజిక ఉర్ధ్వ చలనానికి, పురోగమనానికి దోహదం చేసింది. అమరావతి శాసనాల్లో 'విధిక' అనే చర్మకారుడు వేయించిన దాన శాసనం లభించింది ఆయన తన కుటుంబ సభ్యులతో బౌద్ధ స్థుపాన్ని సందర్శించి పూర్ణఘటంతో వున్న ఫలకాన్ని స్తూపానికి దానం చేశాడు. సమాజంలోని అట్టడుగు వర్గాల్ని బౌద్ధం విశేషంగా ఆకర్షించిందనటానికి ఇది ఉదాహరణ. ఈనాటి కులవ్యవస్థ పరిభాషలో, 'విధిక' చర్మకారుడు పంచమ కులస్థుడు. ఆంధ్రదేశంలో ఏ హిందూ దేవాలయానికి ఒక ''పంచముడు'' దానం చేసిన సంఘటన కనిపించదు ఈ విధంగా బౌద్ధం ఆంధ్రలో బహుజనుల ఆదరణని, అభిమానాన్ని పొందింది.

డా॥ బి.ఎస్.ఎల్. హనుమంతరావు బౌద్ధంలోని సర్వ సమభావాన్ని (కాస్మోపాలిటన్ స్పిరిట్) ప్రత్యేకంగా వివరించారు.[9] బౌద్ధ క్షేత్రాలలో లభించిన శాసనాలలో వేటిలో కూడ కులాల ప్రస్తావన లేదంటారు. సర్వసమ భావాన్ని బౌద్ధం ప్రోత్సహించిందనటానికి చక్కని తార్కాణం 'విధిక' చర్మకారుడు వేయించిన దానశాసనం అంటారు. బౌద్ధక్షేత్రానికి బ్రాహ్మణులు చేసిన దానాలు దాదాపు కనిపించవని, ఒకే ఒక శాసనం శాలిహుండంలో లభించిందని పేర్కొన్నారు ''అమరావతి, నాగార్జునకొండ మొదలైనవి చాలా ప్రాచీన బౌద్ధక్షేత్రాలు. అమరావతిలో 150 శాసనాలు దొరికాయి. నాగార్జునకొండలో 70-80 శాసనాలు దొరికాయి. ఈ శాసనాలు వేటిలో కూడా కులాల గురించిన ప్రసక్తిలేదు. ఆఖరికి బ్రాహ్మణ అనే పదంకూడా మనకు కనిపించదు. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర పదాలు ఏవీ ఈ శాసనాలలో కనపడవు. అయితే వాటికి చాలామంది దానధర్మాలు చేశారు. వాటిలో వృత్తిపరమైన పేర్లున్నాయి. ఇవి ఎంతవరకు? క్రీ.శ. మూడవ శతాబ్దంవరకు. క్రీస్తుశకం మూడవ శతాబ్దం వరకు ప్రజల్లో కులచైతన్యం (caste consciousness) అనేది లేదు''.[10] ఏమయినా బౌద్ధం సమాజంలోని పై వర్గాల, వర్ణాల ప్రజలకంటే క్రింది వర్గాల వర్ణాల ప్రజల్నే అపరిమితంగా ఆకర్షించింది. అందువల్లనే పూర్వమీమాంస దార్శనికుడు కుమారిలభట్టు వేదాలకి అవతలవుండే చతుర్ధ వర్ణం (క్రింది కులాల) ప్రజల్నే బౌద్ధం విశేషంగా ఆకర్షించిందంటాడు. (సశేషం)

# కథ - కథకుడు

*(1961 నోబెల్ సాహిత్య పురస్కార స్వీకారోపన్యాసం)*

మూలం
ఇవో ఆండ్రిక్

అనువాదం :
- డా॥ యు. ఎ. నరసింహమూర్తి

**జీవిత పరిచయం**

ఇవో ఆండ్రిక్ (1892 ) ట్రెవ్నిక్ సమీపంలోని డోలక్ గ్రామంలో జన్మించేరు అతని యౌవనదశ అంతా స్వదేశమైన బోస్నియాలో గడచింది అప్పటికి బోస్నియా ఆస్ట్రో - హంగేరియన్ సామ్రాజ్యంలో భాగంగా ఉంది జాగ్రెబ్, వియన్నా, క్రేకో విశ్వవిద్యాలయాలలో ఆయన తత్త్వశాస్త్రాన్ని అభ్యసించారు మొదటి ప్రపంచ యుద్ధప్రారంభం ఆయన చదువుకు విఘాతం కలిగించింది. యుద్ధ ప్రారంభ దినాలలో ఆస్ట్రియా వ్యతిరేక కార్యకలాపాలలో పాల్గొన్నందుకు ఆయన జైలుపాలయ్యారు 1923లో గ్రేజ్ విశ్వవిద్యాలయం నుండి డ్యాక్టరేట్ పట్టా పుచ్చుకుని ఆయన యుగోస్లావియా దౌత్యోద్యోగంలో చేరేరు బెర్లిన్ యుగోస్లావియా రాయబారిగా ఆయన తన చివరి దౌత్య పదవిని నిర్వహించేరు. 1939లో జర్మనీ యుగోస్లావియాపై దండెత్తినపుడు ఆండ్రిక్ బెల్‌గ్రేడ్ చేరుకుని రెండవ ప్రపంచయుద్ధం నడచినంతకాలం ఏకాంతవాసం చేసేరు ఆ తర్వాత కూడా బెల్‌గ్రేడ్‌లోనే నివాసం కొనసాగించేడు.

ఆండ్రిక్ తన సాహిత్యవ్యాసంగాన్ని కవిగా ప్రారంభించేడు 1914 నాటి 'యువ క్రోసియా భావగీతా' లలో (Young Croation Lyrics) అతని గీతాలున్నాయి. యుద్ధం ముగిసేక ఆయన రెండు గ్రంధాలను వచన పద్యాలలో ప్రచురించేడు. అందులో ఒకటైన 'వేదనలు' (Anxieties) అనే గ్రంథం 1919లో వెలువడింది దినచర్య రూపంలో వెలువడిన ఈ గ్రంథం ఆండ్రిక్ యుద్ధానుభవాలను, జైలు అనుభవాలను ప్రతిబింబిస్తుంది ఆ తర్వాత చాలాకాలం 'ఆండ్రిక్ కథానికారచన మీద శ్రద్ధ చూపించేడు 1920లో ప్రచురితమైన The Trip of Alija Djerzelez అనే అతని మొదటి నవలిక ఆండ్రిక్ సృజన సూత్రంలోని బలీయ లక్షణాన్ని ముందుగా ప్రకటించింది ఆండ్రిక్ బోస్నియన్ జీవితాన్ని వస్తువుగా గ్రహించి దానిని విశ్వజనీన మానవ సమస్యారూపంగా తీర్చిదిద్దేడు. రెండు ప్రపంచయుద్ధాల మధ్యకాలంలో ఆండ్రిక్ 'కథలు' అన్న శీర్షికతో మూడు గ్రంధాలు (1924,1931,1936) ప్రచురించేడు

పరిస్థితులు కారణంగా రెండవ ప్రపంచ యుద్ధకాలంలో లభించిన విశ్రాంతి సమయంలో ఆండ్రిక్ 'డ్రినావంతెన' 'బోస్నియాకథ' 'సారాజెవో స్త్రీలు' అనే మూడు పెద్ద నవలలను రాసేరు. ఇవి 1945లో ప్రచురించబడ్డాయి.

నోబెల్ బహుమానం అంతర్జాతీయ స్థాయిలో ఇచ్చే అసాధారణ పురస్కారం. అందరి దృష్టిలో మాదొక చిన్నదేశం స్వీడిష్ అకాడమీ తన విధ్యుక్త ధర్మ నిర్వహణలో భాగంగా ఈ ఏడాది నోబెల్ సాహిత్య పురస్కారానికి అర్హునిగా ఒక చిన్నదేశపు రచయితనైన నన్ను ఎంపిక చేసింది ఈ పురస్కారాన్ని స్వీకరించే సందర్భంలో నా దేశాన్ని గూర్చి రెండుమాటలు చెప్పాలనుకుంటున్నాను. మీ ఉదార

పురస్కారానికి పాత్రమైన ఈ కథకుడి కృషికి, సాధారణ శీలానికి చెందిన కొద్ది ఆలోచనలను కూడా మీ ముందుంచాలనుకుంటున్నాను

మా దేశపు రచయితలలో ఒకరు నాదేశాన్ని ''లోకాల మధ్య ఒక చిన్న దేశం''గా చిత్రించేడు దాని గతిఎంతో విభ్రాంతికరమైన భీభత్సంతోను, శతృత్వంతోను అణగారినది సాంస్కృతిక రంగంతోపాటు, ఆ అణగారిన రంగాలన్నింటిలోనూ సర్వతోముఖ వికాసాన్ని సాధించడానికి నాదేశం ఇప్పుడు వాయువేగంతో పరుగులు తీస్తోంది. గొప్పత్యాగాలు చేస్తూంది బృహత్తర ప్రయత్నాలు చేస్తూంది ఈ సంవత్సరపు నోబెల్‌సాహిత్య పురస్కార స్వీకారానికి నన్ను ఎంపిక చేసి మీరు నా దేశపు సాహిత్య వ్యాసంగం మీద ఉజ్జ్వలకాంతిని ప్రసరింపజేసారు ఇప్పుడీ వెలుగు నాదేశపు ఎందరో కొత్త రచయితల మీద, మౌలిక రచనల మీద ప్రసరించింది ప్రపంచసాహిత్యానికి తనవంతు సేవలందించడానికి చిత్తశుద్ధితో ప్రయత్నిస్తున్న నా దేశపు సాహిత్యానికి గుర్తింపును సాధించడానికి ప్రారంభించింది నిస్సందేహంగా ఈ దేశపు రచయితకు ఉన్నత ప్రమాణాల్ని కల్పించి మీరు ఎంతో ప్రోత్సాహాన్ని అందించారు మీ ఎంపిక మా కృతజ్ఞతకు పాత్రమైనది ఇక్కడ ఈ సందర్భంలో సవినయంగా మనస్పూర్తిగా మీకు నా కృతజ్ఞతను తెలుపుకునే అవకాశాన్ని పొందినందుకు నేనెంతో సంతోషిస్తున్నాను.

నా రచనకు మీరు సర్వోన్నత పురస్కారాన్నిచ్చి గౌరవించేరు. దానిని గురించి నేనే మీకు వివరించడం చాలా కష్టం అది చాలా సున్నితమైన వ్యవహారం. నా రచన - నేను వేరు కాదు అది నాలో ఒక భాగం. నాలో ఒక భాగమైన నా రచనను గూర్చి నేను మాట్లాడే సమర్ధత నాకు లేదనిపిస్తుంది. మనలో చాలామంది మౌనంగా, అపరిచితంగా ఉన్న సమకాలిక రచనయితలను, ప్రసిద్ధప్రాచీన రచయితలను మాత్రమే సృజనాత్మక రచయితలుగా పరిగణిస్తారు రచయిత సొంత గొంతు జోక్యం చేసుకోనప్పుడే కళారూపం తన విస్పష్టమైన, పవిత్రమైన గొంతును వినిపించగలదని భావిస్తారు ఈ ధోరణి అంత అసాధారణమైనదీకాదు, మరీ అంత కొత్తదీ కాదు రచయితలు తమ రచనల మంచి చెడ్డలను తామే నిర్ణయించలేరని మాంటే (Montesqieu) ఆరోజుల్లోనే వాదించేడు ''రచయిత వ్యాపారం రచించడమే, మాట్లాడడం కాదు'' అన్నగొథేను (Goethe) ఎంతో ఆరాధనపూర్వతమైన అవగాహనతో చదువుకున్న సందర్భం నాకు జ్ఞాపకం వస్తూంది చాలాకాలం తర్వాత అదే అభిప్రాయాన్ని సుప్రసిద్ధుడైన ఆల్బర్ట్‌కామూ (Albert Camus) ప్రతిభామహితంగా వ్యక్తీకరించడం చూసి నేను విచలితుణ్ణయ్యాను

సూటిగా నాకు వర్తించే విషయం ఇది కథకు కథకుడికి సంబంధించిన ఈ సమాన్యాంశాన్ని దృష్టిలో పెట్టుకుని నన్ను చెప్పనీయండి వేలకొలది భాషలున్నాయి విభిన్న వాతావరణాలున్నాయి. అత్యంత ప్రాచీనకాలం నుండి, శతాబ్దాలు శతాబ్దాలుగా కథాకథనం జరుగుతూంది. మన తాత ముత్తాతలు చలినెగళ్ల చుట్టూచేరి కథలు చెప్పుకున్నారు. ఆధునిక కథకులు ప్రపంచపు మేటి నగరాల్లోని ప్రచురణాలయాల ప్రాంగణాల్లో కథలల్లుతున్నారు. అప్పటినుండి ఇప్పటిదాకా విసుగూ విరామం లేకుండా ఒకరితో ఒకరు చెప్పుకునేది, అందంగా అల్లుకునేది మనిషికథే. కాలాన్నిబట్టిపరిస్థితులనుబట్టి చెప్పేవిధానం, కథను అల్లేవిధానం మారుతున్నాయి. కాని కథను చెప్పడంలో, కథ చెవి నుండి చెవికి

ప్రాకడంలో ఉండే అభిరుచి అలాగే ఉంది. కథాస్రవంతి నిరవధికంగా ప్రవహిస్తూనే ఉంది ఎన్నడూ ఎండిపోలేదు అందుచేత చైతన్యోదయం అయిన నాటినుండి నేటిదాకా, అన్నియుగాలలోనూ, మానవాళి నిరంతరాయంగా తనకుతాను ఒకే కథను చెప్పుకుంటూ వస్తుందని మనం నమ్మాలి అయితే ఆయావేళల్లో మానవజీవన ఉచ్ఛ్వాస నిశ్వాసాల లయ కనుగుణంగా అది అసంఖ్యాక రూపాలను ధరించింది ప్రఖ్యాతుడు, వాగ్మి అయిన షెహర్జాదే (Scheherazade) ఫణితిని దర్శించిన తర్వాత ఈ కథ మరణశిక్ష నమలు జరిపేవాడి తుపాకి మడమను విరవడానికి, మనను బెదరించే అనుల్లంఘనీయమైన విధి తీర్పును తిరస్కరించడానికి, జీవనానికి కాలానికి సంబంధించిన మాయావరణాన్ని కొనసాగించడానికి మోరసాచినట్లు ప్రతి ఒక్కరూ చెప్పగలరు

కథకుడు తన రచనతో మానవుడు తనను తెలుసుకోవడానికి, గుర్తించడానికి సహాయపడాలా? జీవన రథచక్రాల క్రింద పడినలిగి తమంత తాముగా తమ వేదనను అభివ్యక్తం చేసే శక్తిసామర్థ్యాలు లేని వారందరికోసం గళంవిప్పి, వారందరిని ''రారండో రండో రండి!'' అని పిలుపునిచ్చే కథకుని పిలుపే కథ అనుకుంటాను లేక చీకట్లో తన భయానికి తానే ఆందోళనపడుతూ పాటపాడే పసిపిల్లలా తన సొద తనకే వినిపించుకోవడమే కథా? అర్థరహితంగా, అపస్మారకంగా మనం కొనసాగిస్తూన్న జీవితంలోని, మన బలహీనతలోని ఊహాపోహల కతీతంగా కొనసాగుతూ, చీకటి దారుల్లోకి మనల్ని విసిరేసే జీవితం మీద వెలుగురవ్వల్ని విసిరి, జీవితం అంటే ఏమిటో మనకు బోధపరచడమే కథకు లక్ష్యమా? అందుకే మన క్రియ - నిష్క్రియల మీద, మనం ఏం చెయ్యాలో - ఏమి చేసి ఉండకూడదో అనే అంశాల మీద మంచి కథకుడి మాటలు తరచుగా వెలుగును ప్రసరిస్తాయి. ఊకుడు కథలుకానీండి లిఖిత కథలు కానీండి. ఇలాంటి కథల్లో మానవజాతి వాస్తవచరిత్రను కనుక్కోలేకపోతే, ఆ చరిత్ర సారాన్ని కనీసం తడుముకోలేకపోతే ప్రతి ఒక్కరూ ఆశ్చర్యపడతారు. అది నేటికథా, నాటికథా అన్న ఊసుమనకొద్దు.

అయినప్పటికీ గతానికి చెందిన కథ ఉపేక్షామూలకంగా కొంతమేరకు వర్తమానానికి తిరోముఖంగా ఉంటుందని కొందరంటారు. చారిత్రక కథలను, నవలలను రచించే రచయిత ఈ హేతురహితమైన తీర్పును అంగీకరించడని నా అభిప్రాయం. అందుకు బదులుగా మన మనుకునే వర్తమానానికి, మనమనుకునే గతానికి మధ్యనున్న శతాబ్దాల ద్వారాలను కలలో మాదిరిగా సులభంగా దాటిపోయిన విషయం బహిరంగంగా అంగీకరించడానికైనా మొగ్గుతాడు చివరిమాట ఒకటుంది. గతం - వర్తమానం ఒకే రకమైన స్వభావంతోగాని, ఒకేరకమైన సమస్యలతోగాని మనతో తలపడవు. జన్మ అంటే ఏమిటో మనకు తెలియదు. జన్మించాలని మనం కోరుకోము భావసాగరంలో మాత్రం ఎగిరిపడతాము. ఈత నేర్చుకుంటాం, జీవిస్తాం. ఒక గుర్తింపును పొందుతాము. బయటనుండి ఎదురయ్యే ఆఘాతాలను, నిరోధిస్తాము అనూహ్యసంఘటనలను, విధివశమైన చర్యలను ఎదుర్కొంటాము. ఈ సందర్భాలన్నింటిలోనూ శక్తికిమించిన ఎడతెగని పోరాటమేనా మనిషిగా పుట్టడమంటే? అన్నిటికీమించి ఒకడు దీనంతటికోసం తన మేధను మధించడం - ఒక మాటలో చెప్పాలంటే మానవుడుగా మనడం అంటే అదే.

గతానికి వర్తమానానికి మధ్యనుండే ఊహాసిద్ధ విభాజక రేఖ నధిగమించి రచయిత సూక్ష్మేక్షికతో మానవస్వభావాన్ని తనకుతానుగా కనుక్కోవాలి. బాధ్యతా యుతంగా పరిశీలించాలి. తన శక్తిమేరకు అవగాహన చేసుకోవాలి. దానితో మమైకం కావాలి. తన ఉచ్ఛ్వాస నిశ్వాసాలతో, కవోష్ణ రక్తస్పర్శతో

దానికి శక్తి నివ్వాలి. పాఠకులకోసం తాను అనువదించే సజీవగాథలోని పడుగు పేకలుగా తాను మారడానికి ప్రయత్నించడం కథకునివిధి అప్పుడే సుందరమైన, పూర్ణమైన, సమ్మతమైన, సంభావ్యమైన ఫలితం లభిస్తుంది అదీ దానికథ

ఒక రచయిత తన లక్ష్యాన్నెలా చేరుకోగలడు? దీనికి మార్గాలేవి? సాధనాలేవి? ఊహాలకు పగ్గాలువదలడమే దీనికి మార్గమంటారు కొందరు సుదీర్ఘమైన, శ్రమ భరితమైన శ్రద్ధతో చరిత్ర-సామాజిక పరిణామం అందించే సూచనలను అధ్యయనం చేయడం వలన అది సాధ్యమౌతుందటారు మరికొందరు గతయుగాల సారాన్ని, అర్థాన్ని జీర్ణించుకోవడానికి కొందరు ప్రయత్నిస్తారు బహుగ్రంథకర్త అయిన ఒక ప్రసిద్ధ ఫ్రెంచి నవలాకారుడు ''చరిత్ర అంటే నా నవలల్ని ముందుకు ఊగించే నాచేతిలోని ఆసవచషకము'' అన్నాడొకప్పుడు చపలచిత్తులు, దారినపోయే దానయ్యలయిన ఇతరులు ఈతోవ పడతారు. ఒక మాటలో చెప్పాలంటే తన కృతిని సుకృతిగా చేసుకోదలచిన నవలాకారుడికి వేలకొలది తోవలూ, పరికరాలు ఉన్నాయి. కాని అన్నిటికంటె ముఖ్యమైనది, నిర్ణయాత్మకమైనది అతని కృతి మాత్రమే.

''మాంధాతనాడు మసలిననాలో కల్పాంతాలు కడముట్టుతున్నాయి'' అని పాతసామెత ఒకటుంది దీనిని అన్ని విషయాలను అందరికీ తెలిసేలాగ, ఎప్పటికీ తెలిసేలాగ, చెప్పదలచిన చారిత్రక నవలారచయిత తన రచనలకు పతాకవాక్యంగా (Epigraph) ఉంచవచ్చును. అయితే ఈ పతాకవాక్యం ఉన్నాలేకున్నా నవలాకారుడి కృతి తన ఉనికి వలన ఈ భావాన్ని సూచిస్తూనే ఉంటుంది

అయితే - చివరకు ఇవన్నీ కేవలం శిల్పసంబంధి ప్రశ్నలు, అభిరుచులు, నిర్మాణరీతులు గాగాని, ఒక కృతికి సంబంధించిన ఆహ్లాదకరమేధోజనిత కాలక్షేపంగా గాని, దానితో కూడిన అనిర్దిష్టరీతులుగా గాని మిగుల్తున్నాయి. అంటకంటె వేరుకాదు. చివరకు రచయిత గతాన్ని మేల్కొలిపాడా, వర్తమానాన్ని వర్ణించాడా, ధైర్యంగా భవిష్యత్తులోకి మునకలు వేసాడా అన్నది అంత పట్టించకోద్గగ విషయంకాదు అతని కథను అందించే జీవమేదైతే ఉందో అదే ప్రధానమైనది. మానవాళికి ఆయన అందించే సందేశం ప్రధానమైనది. ఇక్కడ నియమ నిబంధనలన్నీ నిష్ప్రయోజకాలన్నది తేటతెల్లమైన విషయం ప్రతి కథకుడు తన అంతర్గత అవసరాల కనుగుణంగాను, స్వతస్సిద్ధములు - జ్ఞాన సముపార్జితములు అయిన తన మొగ్గలు మోజుల కనుగుణంగాను తన తలపుల కనుగుణంగాను, తన అభివ్యక్తి సాధనాల కనుగుణంగాను తన కథను నిర్మిస్తాడు ప్రతి కథకుడు తనదైన కథకు ఒక నైతిక బాధ్యతను ఆరోపించుకుంటాడు. దానిని స్వచ్ఛందంగా చెప్పడానికి అతనికి అనుమతించాలి. ఒక కథకు రూపం ఏమిటి? వస్తువు ఏమిటి? అనే అంశాన్ని వదలి అది ఒక కథకుడు తన సమకాలికులకు చెప్పిన కథ అని ఆశించదగినదిగా ఉండాలి అసూయాద్వేషాలతో అది కళావిహీనం కాకూడదు. మారణాయుధాల మ్రోతలో అది మరుగునపడకూడదు. అది ప్రేమ నుండి మొలకెత్తాలి. స్వేచ్ఛాయుతమైన, పవిత్రమైన మానవమేధ నుండి వెలువడిన విశాల భావాలతో అది ఉత్తేజితం కావాలి. మనిషికి - మానవాళికి ఏదో ఒకరూపంలో ప్రయోజనకారులు కాని కథ-కథకుడు ఎందుకూ కొరగారు. ఇది ప్రధానమైన అంశం. ఈ సందర్భంతో ఉత్తేజితుడనై, సూక్ష్మఛాయలో నేను వెల్లడించదలచిన విషయమిదే. ప్రగాఢమైన, చిత్తశుద్ధిగల మళ్లీ మళ్లీ కృతజ్ఞతలను తెలుపుకుంటూ, మీ అనుమతితో ఆ కథనరీతులను నేను ప్రారంభించిన రీతిగానే ముగించగలనని విన్నవిస్తున్నాను.

**సమర్పణ**

( ఏండర్స్ ఆస్టర్లింగ్ - శాశ్వతకార్యదర్శి - స్వీడిష్ అకాడమీ)

యుగోస్లావియా రచయిత ఇవో ఆంద్రిక్ 1961వ సంవత్సరపు నోబెల్ సాహిత్య పురస్కారాన్ని పొందారు ఆయన యుగోస్లావియాలో అసాధారణ ప్రజ్ఞాశాలి అయిన నవలాకారుడిగా గుర్తింపుపొందారు ఇటీవలి కాలంలో ఆయన రచనల పాఠకుల సంఖ్య విస్తృతంగా పెరిగింది ఆయన రచనలెన్నో ఇతరభాషల్లోనికి అనువదింపబడ్డాయి ఆయన బోస్నియాలో స్థిరనివాసం ఏర్పరుచుకున్న ఒక కార్మిక కుటుంబంలో 1892లో జన్మించారు ఆయన పసితనంలో బోస్నియా ఇంకా ఆస్ట్రియన్ పాలనలోనే ఉంది

యువసెర్బియా విద్యార్థిగా ఇవో ఆంద్రిక్ జాతీయ విప్లవోద్యమంలో చిత్రహింసలు అనుభవించారు 1914లో యుద్ధం అరంభమైన తర్వాత ఆయన జైలుపాలయ్యారు అయినప్పటికీ ఆయన ఎన్నో విశ్వవిద్యాలయాలలో చదివి చివరకు గ్రాజ్ (Graz) విశ్వవిద్యాలయం నుండి పట్టాపుచ్చుకున్నారు. ఎన్నో సంవత్సరాలు దౌత్యోద్యోగిగా తన దేశానికి సేవ చేసేరు రెండవ ప్రపంచ యుద్ధారంభంలో ఆయన బెర్లిన్‌లో యుగోస్లావియా రాయబారిగా పనిచేసేరు. బెల్‌గ్రేడ్‌కు ఆయన చేరుకున్న కొద్దిగంటలలోనే జర్మన్ విమానాలు ఆనగరంపై బాంబుదాడి చేసేయి. జర్మన్ ఆక్రమణలో పలాయనం పుచ్చుకోవలసివచ్చినా, ప్రాణాన్ని దక్కించుకుని, ఆకాలంలోనే ఆయన చెప్పుకోదగ్గ మూడునవలలు రాసేరు ఈ నవలలు 'బోస్నియాత్రయం' అని పేరుపడ్డాయి ఈ నవలలోని సామాన్యాంశం ఒకటి కాదు. ముస్లిమ్ - క్రైస్తవ ప్రతీకతో నిండిన చారిత్రిక భూమిక వీటి మధ్య సంబంధాన్ని కల్పిస్తూంది. చెవులు చిల్లులు పడే తుపాకీ మోతల్లో, దేశం సర్వనాశన మౌతున్న తరుణంలో ఇలాంటి రచనల ఆవిర్భావాన్ని ఎవరూ అంచనా కట్టలేరు ఇది కొట్టవచ్చినట్టుగా కనబడే ఏకైక సాహిత్య విజయంగా కనిపిస్తుంది. 'బోస్నియాత్రయం' 1945 దాకా ప్రచురణకు నోచుకోలేదు

''బోస్నియా త్రయం'' అని పేరుపడ్డ స్థలపురాణాలన దగిన ఈ రచనల్లో నవలారూపంలో ఒక ఐతిహాసిక పరిణతిసిద్ధించింది. ఇందులో ''డ్రినా వంతెన'' (The Bridge on the Drina) ఇవో ఆంద్రిక్ సర్వోత్తమ రచన. ఇది భావకవుల్లా, ఆత్మాశ్రయధోరణిలో, దుర్భరనైరాశ్యంలోంచి తన యువహృదయాన్ని ఆవిష్కరించే దశలోంచి వెలువడింది. జైలు జీవితంలోని ఒంటరితనంలో ఆంద్రిక్‌కు కీర్క్‌గార్డ్ (Kier Kegaard) రచనలు ఎంతో ఊరటను కల్పించేయి. అప్పటి కఠోర ఆత్మనిగ్రహంతో ఏర్పడినవైరాగ్యం నుండి జనించిన గవేషణలో తనకు తానుగా ఎంతో వెనక్కుపోయి ''శాశ్వత అజ్ఞానము - దివ్యపైత్రుకము'' (the eternal cenconscious and blessed patrimony) అనే సిద్ధాంతాన్ని దర్శించేడు. ఆదర్శనమే అతనిరచనల్లో పరిచయం చేయబడిన వర్తమాన ఐతిహాసిక రూపంగా ప్రకటితమయింది. అప్పటినుండి ఆంద్రిక్ ఆదర్శనంలోనే తన కృషిని కొనసాగించేడు. తన రచనలతో తాతముత్తాతల అనుభవాలు ఎలాంటివనే విషయాన్ని చెప్పి ప్రజల్ని చైతన్యవంతుల్ని చేసే వ్యాఖ్యాతగా వ్యవహరించేడు ఇవో ఆంద్రిక్.

బోస్నియాలోని విజెగ్రాడ్ నగరసమీపంలో 16వ శతాబ్ది మధ్య భాగంలో వజీర్ మెహ్మద్ పాషా నిర్మించిన వంతెనకు సంబంధించిన వీరగాథ ''డ్రినావంతెన'' (The Bridge on the Drina)

నవల అయింది లేతరంగు రాళ్లతో, దృఢంగా నిర్మించబడిన పదకొండు స్తంభాలపై నిలిచిన వంతెన అది ఆ నిర్మాణంలో ఎంతో విలువైన నగిషీపని ఉంది దాని మధ్యభాగంలో ఉన్నతమైన కట్టడముంది ఒక యుగానికి చెందిన ఘనమైన జ్ఞాపకాలను సగర్వంగా తరువాతి శతాబ్దాలకు చాటిచెప్పిన ఆ వంతెన మొదటి ప్రపంచయుద్ధంలో పేల్చబడింది అట్టోమన్ సామ్రాజ్యపు నడిగడ్డలోని ఆ వంతెన ప్రాక్పశ్చిమ సయోధ్యా సేతువుగా నివాలని ఆ వజీరు కోరుకున్నాడు. ఆ వంతెన మీంచి ఎన్నో సైన్యాలు, బిడారులు నడచేయి. అనిశ్చిత చారిత్రిక సంధ్యల అడుగున బడిన ఎన్నో తరాల శాశ్వతత్వానికి, నైరంతర్యానికి ప్రతీకగా నిలిచిందా వంతెన. విధ్వంసకరమైన ప్రపంచపు మారుమూల ప్రదేశంలోని ప్రతిముఖ్య సంఘటనకు ఈ వంతెన రంగస్థలమయింది. ప్రపంచ చరిత్రలో చెప్పుకోదగిన వీరోచిక రక్తసిక్తపోరాటం ఈ వంతెనపై జరిగింది ఈ నదీ ఘోషను ఆంద్రిక్ తన స్థలపురాణంలో దశదిశలా మారుమ్రోగించేడు

''బోస్నియాకథ'' (Bosnian Story) అన్న తరువాతి నవలలో నెపోలియను యుద్ధాలనాటి కథ చోటు చేసుకుంది టర్కీ వజీరు స్థిరనివాసమేర్పరుచుకున్న ఒక పురాతన శిథిల నగరంలో ఆస్ట్రియా - ఫ్రెంచి రాజప్రతినిధుల మధ్య రగుల్కొన్న శత్రుత్వాన్ని ఈ నవలలో చూస్తాము. ఆ ఇద్దరినీ విషాద పర్యవసానంలో ముంచిన ఘట్టాలమధ్య మన ముంటాము. ట్రావ్నిక్ (Travnik) నగర గల్లీలలోని బజారుల్లో చెలరేగిన అసంతృప్తి, సెర్బ్ - క్రోసియను రైతుల తిరుగుబాట్లు, మహమ్మదీయులు - క్రిస్టియన్లు - యూదుల మధ్య నడచిన మతయుద్ధాలు - ఒక శతాబ్ది ఉద్రిక్తత అనంతరం సారాజెవోలో (Sarajevo) మెరసిన మెరుపుతో చిరుగులు పడ్డ వాతావరణ కల్పనకు ఇవన్నీ దోహదం చేసేయి ఈ నవలా కల్పనలో ఆంద్రిక్ దర్శనవైశాల్యం శక్తిమంతంగా వెల్లడయింది. సంకీర్ణవస్తు నిర్వహణలో ఆయన సిద్ధహస్తుడనిపించుకున్నాడు.

''సారాజెవో స్త్రీలు'' (The Women from Sarajevo) అనే మూడో నవలపై రెండింటికంటె భిన్నమైనది. దురాశాపరుల రోగగ్రస్త పైశాచిక లక్షణాలకు చెందిన మనస్తత్వాధ్యయనం ఇది. ఈ రచన సారాజెవోలో ఒంటరిగా నివసించే ఒక వ్యాపారికుమార్తె కథను చెప్తుంది. దివాలా తీసిన ఆమె తండ్రి కన్నుమూస్తూ జీవన క్రౌర్యాన్ని ఎదిరించే శక్తి ఒక్క ధనానికే ఉంది కాబట్టి వడ్డీల వసూళ్లలో నిర్దాక్షిణ్యంగా ఉండమని కూతురికి చెప్తాడు ఈ చిత్రణ అద్భుత విజయాన్ని సాధించింది. అయినా ప్రశంసావహమైన తన కథన ప్రజ్ఞను పరిపూర్ణంగా ప్రదర్శించడానికి వీలులేని కథావస్తువుకు ఆంద్రిక్ కట్టుబడిపోయాడు.

ఆంద్రిక్ ఆధునిక మనస్తత్వవాద అంతర్దృష్టిని అరేబియన్‌నైట్సులోని విధివశతను జతకలిపేడు. మానవాళి విషయంలో ఆంద్రిక్ ఎంతో మృదుహృదయుడు; సున్నిత మనస్కుడు. కాని భయానక - భీభత్సాలను చూసి ఆయన ఎప్పుడూ కుంచించుకుపోలేదు. ప్రపంచ దౌష్ట్యంలోని వాస్తవస్థితి ఆయన అత్యంత ప్రత్యక్ష ప్రమాణంగా నిలిచింది. రచయితగా ఆంద్రిక్ తనకు సంబంధించిన మౌలిక గాథా

పరంపరనే స్వీకరించేడు. ప్రపంచ స్థలపురాణంలోని అపరిచిత పుటను ఆయన తెరచి చూపించేడు బార్కిన్ బానిసల అగాధవ్యధి తాత్మల నుండి మన కరుణాంతరంగాలకు కదలిక కలిగిస్తాడు ఆండ్రిక్

ఆండ్రిక్ రాసిన ఒక నవలలో ఒక యువవైద్యుడు 1920ల నాటి బోస్నియాలోని తన అనుభవాలను తిరగేసుకుంటూ ఇలా అంటాడు ''సారెజెవోలో ఒక రాత్రి నీవు మేల్కొని ఉంటే సారాజెవో రాత్రి గొంతుకలను విడమరచి గుర్తించడం నేర్చుకుంటావు కేథలిక్కుల ప్రధానాలయంలోని ఘంట ఖంగుమంటూ దృఢంగా రెండు గంటలు కొడుతుంది ఆ తర్వాత దీర్ఘమైన చెవిసోకని గడువులు ఆ తర్వాత కొంతసేపటికి, కొంచెం హీనస్వరంతో ఉన్నా తీక్షంగా ఆర్థడాక్సు చర్చి రెండు గంటలు కొట్టడం వింటావు అప్పుడు అంతకంటె కటువుగా చాలా దూరాన్నుంచి బోగ్మసీదు గడియారపు గొంతుక వినిపిస్తుంది అది పదకొండుగంటలు కొడుతుంది. పైశాచిక ధ్వనులు నిండిన పదకొండు టర్కీగంటలు ఆ దిక్కులుపడ్డచోట విపరీత కాల విభజన తర్వాత లెక్కించుకొంటావు. యూదులకు మోగించుకోవడానికి సమయఘంటలే లేవు అప్పుడు వారి సమయం ఎంతయిందో దేవుడికే తెలియాలి సెఫార్డిమస్ (Sephardıms), ఆష్కినాజినుల (Ashkenazıns) పంచాంగాలలో సూచింపబడ్డ సంఖ్య ఏదో భగవంతుడికే తెలియాలి. అందరూ గాఢనిద్రావివశులై ఉన్నా ఆ నిశీధి గర్భంలో కూడా ప్రపంచం విభక్తమై ఉంది తెల్లవారేదాకా, రాత్రి చివరిగంటలు లెక్కించబడుతూన్నంత సేపూ ప్రపంచం విభక్తమయ్యే ఉంది.

ఆండ్రిక్ రచనలపై అధికారం చెలాయించిన ప్రధాన సమస్యలకు ఈ ధ్వని గర్భితమైన నిశీధ వాతావరణం కూడా ఒక కీలు కావచ్చును ఆండ్రిక్ చరిత్రను, తత్త్వశాస్త్రాన్ని అధ్యయనం చేసేడు తీవ్రాఘాతాలలో, కఠోర శత్రుత్వాలు, సంఘర్షణలలో ఒక దేశప్రజల ఫణితిని రూపొందించే శక్తులేవి? అని ప్రశ్నించడానికి అతని ఆ అధ్యయనమే మార్గదర్శకమయింది. ఈగవేషణలో ఆధ్యాత్మిక దోరణికి కీలకపాత్ర ఉంది. ఈ శత్రుత్వాల నన్నింటిని ఆయన సావధానము, జ్ఞానసముపార్జితము అయిన నిర్మలదృష్టితో స్వీకరించేడు, పరమోదార మానవతా చైతన్యంతో హేతుకాంతి పుంజాల్లోంచి దర్శించడానికి ప్రయత్నించాడు. సుఖదుఃఖాతీతమైన ఒకవైరాగ్య సందేశం ఆయన రచనలలోని ప్రధాన వస్తువుగా బార్కిన్ దేశాలనుండి ప్రపంచమంతటికీ వ్యాపించింది. మన తరానికి అది అనుభూతమయింది

ప్రియ మహాశయా! మీ దేశ చరిత్ర నుండి వస్తువు నెన్నుకుని మానవలక్ష్యాలను వర్ణించడం వెనుకనున్న మీ రచనలలోని ఐతిహాసిక శక్తికి నోబెల్ సాహిత్య పురస్కారాన్నందిస్తున్నట్లు మీకిచ్చిన యోగ్యతాపత్రంలో రాసి ఉంది. నోబెల్ బహుమాన స్వీకర్తలలో ఇంతవరకు చోటుచేసుకోని, ఒక భాషా ప్రాంతం నుండి సర్వసమర్థమైన ప్రాతినిధ్యాన్ని పొందిన మిమ్మ స్వీడిష్ అకాడమీ పరిపూర్ణ తృప్తి పూర్వకంగా గౌరవిస్తుంది. మనఃపూర్వక శుభాభినందనలను మీ కందజేస్తూ మాననీయులైన మారాజుగారి చేతుల మీదుగా ఈ బహుమానాన్ని స్వీకరించగోరుతున్నాను.

# పోస్ట్ మాడరనిజం

– యన్. ఇన్నయ్య

చెప్పేవాడికీ వినేవాడికీ అర్థం కానిది పోస్ట్ మోడరనిజం అని కొందరంటారు కాని నేడు యూరోప్‌లో, అమెరికాలో జోరుగా పోస్ట్ మోడరనిజం గాలి వీస్తున్నది యూనివర్శిటీలలో, కళల్లో, శిల్పంలో, పోస్ట్ మోడరనిజం మారుమోగుతున్నది ఇది ఆరిపోయే దీపం అనీ, చివరి దశలో దేదీప్యమానంగా వెలిగి, తుస్సు మంటుందని విమర్శకులు ఆశిస్తున్నారు

ఇంతకూ పోస్ట్ మోడరనిజం అంటే ఏమిటి? ఇంటర్వ్యూ చేసి చూస్తే, 10 మంది 12 భావాలు చెబుతున్నారు! తెలిసినట్లే వుంటుంది చేజిక్కకుండా జారిపోతుంది ఒకప్పుడు సోషలిజాన్ని గురించి బ్రిటిష్ తాత్వికుడు వ్యాఖ్యానిస్తూ ఎవరు పెట్టుకుంటే వారి తలకు యిమిడిపోయే టోపీ వంటిదన్నాడు ఇప్పుడు పోస్టు మోడరనిజం అలాగే తయారైంది

పోస్ట్ మోడరనిజం లక్షణాలుగా పేర్కొంటున్న అంశాలు· అభ్యుదయం, బహుళత్వం, పలాయనం, వాస్తవికత, అనిర్ధారణ, నైరూప్యత మొదలైనవి.

1950 ప్రాంతాలలో ఆరంభమైన పోస్ట్ మోడరనిజం ముందు భవన నిర్మాణాలలో దారిమళ్ళించడంతో మొదలైంది.

క్రమేణా పోస్ట్ మోడరనిజం ధోరణి సాహిత్యంలో, తత్వంలో, కళల్లో, సంస్కృతి విమర్శలలో ప్రవేశించింది

ప్రతి సిద్ధాంతంగా పేరొందిన పోస్ట్ మోడరనిజం ముందుగా శాస్త్రీయ ఆధునికతను వ్యతిరేకించడంతో శ్రీకారం చుట్టింది సంప్రదాయ భవన నిర్మాణాన్ని కాదని అమెరికాలో టెలిఫోన్ కంపెనీ పెద్ద భవనం కట్టి, పాప్, హైపర్ రియలిజం,, న్యూ ఇమేజ్ పెయింటింగ్ మొదలైన ధోరణులు వెలువడ్డాయి.

ఆధునిక శాస్త్రీయ పద్ధతిలో కళలు, నిర్మాణాలకు సంబంధించి ఒక తీరు, రేఖా నిర్మాణం, ఆచరణ యుక్తంగా వుండడం, అనే లక్షణాలు ముఖ్యం అన్నారు. ఇందుకు విరుద్ధంగా భిన్నంగా కలగాపులగం, ఆకార వికారాలు, కొత్త ధోరణులు ప్రవేశపెట్టారు. ఇదే ధోరణి వివిధ రంగాలకు విస్తరించారు

జీవిత రంగానికి కూడా పోస్ట్ మోడరనిజం అన్వయించాలని అశాశ్వతం, వికేంద్రీకరణ, ఖండాలుగా వుండడం పై దృష్టి పెట్టాలన్నారు. జాన్ యాష్‌బరీ (John Ashbory) అనే కవి తన కవితలలో యీ ధోరణి ప్రవేశపెట్టాడు.

ఈ వ్యాసంలో ప్రధానంగా, తాత్విక సామాజిక చింతనలో పోస్ట్ మోడరనిజం ప్రభావం చర్చించడం, విషయ వివరణ ముఖ్యోద్దేశ్యం.

మోడరనిజంలో శాస్త్రీయ పద్ధతి, సత్యాన్వేషణకు అత్యంత ప్రాధాన్యత యిచ్చారు. అందులో కొన్ని అతి పోకడలు వున్నాయి. సైన్స్ పేరిట వెర్రితలలు వేసిన సందర్భాలు లేక పోలేదు. వ్యక్తులు తమ

భావాలను సైంటిఫిక్ లోకంపై రద్దిన ఘటనలు వున్నాయి వాటిని ఆధారంగా తీసుకొని పోస్ట్‌మోడరనిజం చావు దెబ్బ కొట్టడానికి ప్రయత్నించింది. సైంటిఫిక్ ప్రపంచం ఒళ్ళు దగ్గర పెట్టుకొని ప్రయత్నించడానికి యిది తోడ్పడుతున్నది. ఆ విధంగా చూస్తే, పోస్ట్ మోడరనిజం మేలు చేసినట్లే!

ఉదాహరణకు జర్మనీలో ఆర్యులు అధికులనీ, మిగిలిన జాతులకన్నా గొప్ప వారనే వాదం సైంటిఫిక్ అని హిట్లర్ ఆధ్వర్యాన వాదనలు బయలుదేరాయి నల్లజాతి వారు అధములనీ, తెల్లజాతివారు అధికులని శాస్త్రీయ పద్ధతి రుజువు పరచినట్లు తప్పుడు వాదనలు చేశారు. స్త్రీలు తక్కువ, పురుషులు ఎక్కువ అనే అహంకారవాదం శాస్త్రీయమని పేర్కొన్నవారున్నారు రాజకీయాలలో సైన్స్‌నువాడుకున్న రాజ్యాధి నేతలున్నారు

వ్యక్తులు ఏది చెబితే అదే నిజం అనే ధోరణి పోస్ట్ మోడరనిజం స్వీకరించి ప్రచారంలో పెట్టింది గతంలో సైన్స్ పేరిట కొందరు వ్యక్తులు చేసిన దుర్వినియోగాలను యీ వాదం స్వీకరించింది

కాని సైన్స్ మాత్రం తన గత దోషాలను దిద్దుకుంటూ ముందుకు సాగుతున్నది. వ్యక్తి ఎంత గొప్పవాడైనా అతడి అభిప్రాయాలు శాస్త్రీయ పరిశీలనకు నిలవకపోతే, శాస్త్రం తృణీకరిస్తున్నది

పోస్ట్ మోడరనిజం ఒక ఫాషన్‌గా, కొత్త ఆకర్షణగా యువతరాన్ని, విద్యారంగంలో కొందరు ప్రొఫెసర్లను ఆకట్టుకున్నది పోస్ట్ మోడరనిజానికి శాస్త్రీయ పద్ధతి అన్వయిస్తే, అదొకతత్వంగా నిలవదు కనుక ఆ వాదంలో వున్నవారు శాస్త్రీయ పద్ధతినే వ్యతిరేకిస్తున్నారు అరాచక వాదం వైపుకు సాగిపోతున్నారు కాలానుగుణంగా యీ పోస్ట్ మోడరనిజం నిలవక పోయినా, తాత్కాలికంగా చాలాహాని చేయగలదు కనుక జాగ్రత్త వహించడం అవసరం. ఈ దృష్ట్యా ప్రపంచవ్యాప్తంగా గోష్ఠి చర్చలు సాగుతున్నాయి

పోస్ట్ మోడరనిజంలో క్రమపద్ధతి లేకున్నా, వారినుండి వస్తున్న మెరుపు ఆలోచనలు మనకు హెచ్చరికలుగా ఉపకరిస్తాయి. శాస్త్రీయ పద్ధతి అనుసరించేవారు తమకు తిరుగులేదు అనే భ్రమలో వుంటే పొరబడ్డట్లే. అది వారినుండి వచ్చిన గుణపాఠం. హేతుబద్ధమైన ఆలోచనకు పోస్ట్ మోడరనిజం ఒక చీడ పురుగు వంటిది. దానిని జాగ్రత్తగా నిర్మూలించడం అవసరం.

అమెరికాలో వామపక్షాల వారు ఎగిరి గంతేసి పోస్ట్ మోడరనిజాన్ని కౌగిలించుకున్నారు. దీని వలన వారిలో గందరగోళం పెరిగింది. శాస్త్రీయ పద్ధతిని వదలేసి, అడ్డగోలుగా ఆలోచిస్తే కార్మిక వర్గాలకు ఉపయోగం వుండదని గ్రహించలేక పోయారు. మైకల్ ఫూకో (Michael Foucault) జాక్ డెరిడా (Jacques Derrida) ల ఆలోచనలు, రచనలు వామపక్షం వారిని ఆకట్టుకున్నాయి. వూబిలో పడ్డ దున్నవలె కొట్టుకుంటున్నారు. రాజుగారి దేవతా వస్త్రాలవలె పోస్ట్ మాడరనిజం తయారైంది.

నిర్వచనాలకు లొంగని పోస్ట్‌మాడరనిజం, అన్ని ప్రమాణాలను ప్రశ్నించడమే ఒక ఫాషన్ అనుకుంటున్నది. కాని తనను ప్రశ్నిస్తే సమాధానం చెప్పలేక తప్పుకుంటున్నది. అదే ఒక జీవిత

విధానంగా గొప్పలు చెప్పుకుంటున్నది. ''సత్యం'' అనేది వ్యక్తిగతం అంటున్న పోస్ట్ మాడరనిజం, బాహ్య సత్యాలు, వాస్తవాలు లేవంటున్నది వ్యక్తి భావించేదే నిజం వాస్తవం అంటూ, ఇంచుమించు ఆత్మాశ్రయ వాదంలోకి దిగజారి పోయింది మిధ్య, కథ, భ్రమలకూ శాస్త్రీయతకూ తేడా లేదనే స్థాయికి దిగజారారు

పోస్ట్ మాడరనిజం వల్ల కేవలం శాస్త్రీయ పద్ధతికేగాక, మానవ హక్కులకు సైతం ప్రమాదం వాటిల్లుతుంది సహేతుక విమర్శ, పరిశీలన, శాస్త్రీయతకు దూరంగా వున్న పోస్ట్ మోడరనిస్టులు గూడుకట్టుకుని, తమ దారిన తాము పోతామంటున్నారు

చైనాలో మానవ హక్కుల గురించి ప్రస్తావన వచ్చినప్పుడు, ప్రపంచమంతా అంగీకరించిన వాటికీ తమకూ తేడా వున్నదని చైనా నాయకులు వాదించారు తమ మానవ హక్కులు చైనా కళ్ళతో చూడాలని ఐక్యరాజ్య సమితి కళ్ళతో చూడరాదన్నారు. అది పోస్ట్ మోడరనిస్ట్ దోరణి. ప్రపంచంలో మానవులందరికీ మానవ హక్కులు వర్తిస్తాయి, భూగోళ పరిస్థితులు, రాజకీయాలు అడ్డం రాకూడదని సమితి అంటున్నది శాస్త్రీయంగా చర్చించిన అనంతరం మానవ హక్కులు నిర్ధారించి, అంగీకరించగా ముస్లింలు కూడా తమకు మినహాయింపు కావాలనడం పోస్ట్ మోడరనిస్ట్ మత ధోరణే.

పోస్ట్ మోడరనిజం కళలు, శిల్పం, భవన నిర్మాణం, పెయింటింగ్ యిత్యాదులలో బాగా వ్యాపించడానికి మార్కెట్ విలువలు కారణం. కొత్తదనం జనాకర్షణకు దారితీయడం వలన ఎప్పటికప్పుడు వినూత్న విధానాలు ప్రవేశపెడుతూ పోయారు.

పోస్ట్ మోడరనిజం కేవలం మోడరనిజానికి గుడ్డి వ్యతిరేకి కాదంటూ వివరణలు యిచ్చిన వారు లేక పోలేదు ఐన్‌స్టీన్, ఫ్రాయిడ్ వంటి వారి పరిశోధనలకు తాము విరుద్ధం కాదంటున్నారు మోడరనిజాన్ని అంగీకరిస్తూనే, అంతటితో ఆగిపోక, ముందుకు సాగుతున్నామంటున్నారు

పోస్ట్ మోడరన్ ఉద్యమంలో కలసిపోయిన పాప్ ఆర్ట్, ఫెమినిజం, ఫ్లూరలిజం, కౌంటర్‌కల్చర్, డికన్‌స్ట్రక్షన్‌లను గమనించాలి

నీ సత్యం నీది, నా సత్యం నాది. నీది గొప్ప కాదు, నాది తక్కువ కాదు ఎవరి గొప్ప వారికుంది -- అనే సారాంశ తత్వంతో పోస్ట్ మోడరనిజం సాగుతున్నది. అందులోనే అందరికీ వర్తించే మానవ హక్కులు, ప్రమాణాలు, శాస్త్రీయ పద్ధతులను విస్మరించారు. శాస్త్రీయ పద్ధతి ఎప్పటికప్పుడు తప్పులు దిద్దుకుంటూ, వ్యక్తి భావాలకు గాక, సామాన్య పరిశోధనా రుజువులకు విలువ యిస్తుందనేది మరచిపోయారు మరొకటి కనిపెట్టేవరకూ లోగడ కనుగొన్నది సత్యంగా వుంటుంది. ఏదీ శాశ్వత సత్యం కాదు. మన జ్ఞాన పరిధి విస్తరిస్తుంటే, సత్య ప్రమాణాలలో మార్పులు వస్తుంటాయి కొత్తవి కనుగొన్నప్పుడు పాతవాటిని చరిత్రలోకి నెట్టేస్తాం. గతంలో ఎవరో గొప్పవారు చెప్పారు గనుక అవి పవిత్రమని శాస్త్రం ఒప్పుకోదు. రుజువుకు నిలవాల్సిందే కనుకనే అభివృద్ధి నిరంతరం సాగుతుంటుంది. అంతం అనేది లేదు. మత పవిత్రగ్రంధాలలో చెప్పిందే తుది మాట అని, అంతకుమించి సత్యం లేదు అనేది కేవలం నమ్మకం. శాస్త్రీయ పద్ధతికి అది విరుద్ధం.

బహుళవాదం కూడా పోస్ట్ మోడరనిజంలో ప్రధానంగా వుంది. వివిధ సంఘాలు, మతాలు, సంస్కృతులు, ఆచార వ్యవహారాలు భిన్నంగా వుంటాయి కనుక ఏదీ ఉన్నతం కాదు, అధమం కాదు అన్నిటినీ ఆయా ప్రజలు పాటిస్తుంటారు మనం కూడా గౌరవించడం నేర్చుకోవాలి క్రైస్తవులు, ముస్లింలు, హిందువులు, బౌద్ధులు, సిక్కులు, పార్శీలు, కొండజాతులవారు తమ తమ ఆచారాలను పాటిస్తారు ఏది ఎక్కువ, ఏది తక్కువ అనే ప్రశ్నరాదు

ఈ వాదాన్ని అంతవరకు సరిపెట్టుకోవడంలేదు చట్టాలకు, విలువలకు, హక్కులకు విస్తరిస్తున్నారు అంటే ఏమిటి? ఏ మతం వారు ఆ మత గ్రంథాలు, నియమాలు, ఆధారంగా జీవితంలో పాటించాలి అలా చేస్తున్నప్పుడు పరస్పర విరుద్ధమైనవి వస్తే ఏమౌతుంది?

ఉదాహరణకు నేరాలు చేసినప్పుడు వివిధ మతాలువారు వారి మతాచారాల ప్రకారం శిక్షలు విధించే రీతులున్నాయి ప్రజాస్వామిక దేశాలలో అలా కుదరదని, ఒకే రకమైన నేరచట్టం అందరికీ వర్తించారు పౌర చట్టాలలో కూడా అలాగే వుండాలన్నప్పుడు పేచీలు పెడుతున్నారు బహుళవాదాన్ని అడ్డం పెడుతున్నారు

పోస్ట్ మోడరనిజం కేంద్రీకరణకు వ్యతిరేకం విడిగా పడిపోతున్న వాటన్నిటికి సంబంధాలుంటాయే గాని, అన్నిటికీ కేంద్రం అంటూ లేదనేది వారి వాదం. మార్పులు వస్తుంటే, అన్నిటి మధ్యా సంబంధాలు తెగిపోతుంటే, గందరగోళం ప్రబలుతున్నట్లనిపిస్తుంది. అదే పోస్ట్ మోడరనిజంలో ప్రతిబింబిస్తున్నది.

పోస్ట్ మోడరనిస్ట్ ధోరణులు స్థూలంగా యిలా పేర్కొనవచ్చు.

1) సమన్వయం లేని పొందిక (Disharmonious harmony)
2) బహుళ వాదం (Pluralism)
3) నగరీకరణ (Urbane urbanism)
4) మానవశరీర నిర్మాణంతో పోలిన కట్టడాలు, శిల్పాలు, చిత్రాలు (Anthropomorphism in construction)
5) గతాన్ని వర్తమానాన్ని కొనసాగించేరీతులు
6) విషయ చిత్రీకరణలో వైవిధ్యం (Content)
7) పరస్పర విరుద్ధాలు, అస్పష్టత (Double coding) దీనికి హెరాక్లిటస్ తత్వం నుండి ప్రేరణపొందారు. అదో యిదో అనిగాక ''రెండూ, యింకానూ'' అనేది వీరి మూలం.
8) అనేక రీతుల్ని మిళితం చేయగా ఆవిర్భవించే నూతన ప్రక్రియ (Multivalence)
9) చరిత్రను కొనసాగిస్తూనే సంప్రదాయాలకు కొత్త తొడుగులు వేయడం.
10) కావాలని, కొత్తను సృష్టించడం. (New rhetorical figure)
11) Return to the absent center.

కొన్ని పరిశీలనార్హ గ్రంధాలు :

1. Charles Jencks : Post Modernism 1987
Rizzoli, Newyork

2. Noam Chomsky . Year 501 · The Conquest Continues
1993 Boston, Southend Press

3. E.O. Wilson : Consilience : The Unity of Knowledge 1998 - Alfred A. Knopf

4. Alan Sokal & Jean Bricmout : Fashionable Nonsense Picador press, USA

5. Harvey Siegel : Relativism Refuted : A Critique of Contemporary Epistemological Relativism
1987 Dord Recht : D. Reidel publishing Co.

6. Foucault Michel : The Order of Things ·
An Archaeology of the Human Sciences
1970 Random House, New York

7. Gross, paul R & Norman Levitt. The Higher Superstition :
The Academic Left and its Quarrels levith science
1984 John Hopkins University press, Baltimore

8. Lyotard, Jean - francois, The Post USA Modern
Condition : A Report on Knowledge
1984 University of Minnesote Press, Menneapolis USA.

9. Jameson, Frederik, Postmodernism
or USA the Cultural logic of Late Capitalism
1991 Duke University Press, Durhem, USA

10. Humanism and Postmodernism
Nach Pox 191
5901 - J Wyoming, NE, Albquerque, NM87109 USA

# మానవీయతకు ప్రజాస్వామ్యం

ఆంగ్లమూలం — తెలుగు సేత

డా. జయప్రకాశ నారాయణ — అన్నపరెడ్డి వెంకటేశ్వరరెడ్డి

(బొంబాయి యమ్ యన్ రాయ్ హ్యూమన్ డెవలప్‌మెంట్ భవన్‌లో జనవరి 10 నుంచి 14 వ తేదీ వరకు జరిగిన 14వ అంతర్జాతీయ మానవవాద ధార్మిక సంఘ సమావేశంలో లోక సత్తా సంస్థాపకుడు, అధినేత, డా॥ జయప్రకాశ నారాయణ చేసిన ఆంగ్ల ప్రసంగానికి తెలుగు రూపం

మనిషి మానవుడుగా, మానవుడు మానవీయుడుగా ఎదగడానికి ప్రజాస్వామ్యం ఆవశ్యకం ఆ ప్రజాస్వామికం ఇవ్వాళ ఎలా ఉందో జయప్రకాశ చర్చించారు చదవండి సం )

డా. ఇందుమతి పరేఖ్‌గారు మొదట నన్ను ఈ సమావేశాలలో పాల్గొన వలసిందని ఆహ్వానించి నప్పుడు ఆ ఆహ్వానాన్ని తిరస్కరించాలనుకొన్నాను కారణం ఏమిటంటే, నాకు వ్యవధి లేదు, ఆపైన శిక్షణ రీత్యా నేను వైద్యుణ్ణి పదాలకు అర్థాలు అనేకంగా ఉంటాయి మాటలను ఎలాగైనా ఉపయోగించవచ్చు తరచు పదాలు చెప్పడం కంటె దాచడం చేస్తాయి పదాలకు అర్థాలు ఉపయోగించేవారిని బట్టి మారతాయి జర్మన్ డెమోక్రాటిక్ రిపబ్లిక్‌ని ఒక ప్రజాస్వామ్యంగా భావిస్తాం అలాగే పీపుల్స్ రిపబ్లిక్ ఆఫ్ చైనా గూడ ప్రజాస్వామికమే. ఈ విధంగా మనం అనంతంగా చెప్పుకొంటూ పోవచ్చు ప్రజాస్వామికం అంటే, స్వేచ్ఛ, స్వయం పాలన, ప్రజలదే అధికారం, చట్ట బద్ధపాలన, స్వయంచాలక సవరణ (Self Correcting) శక్తిగల సంస్థలతో గూడిన యంత్రాంగం ప్రజాస్వామికం అంటే ఇది ఇంతకంటె ఎక్కువకాదు, తక్కువ కాదు.

అయితే మనకు ప్రపంచంలో రెండు వ్యతిరేక దృక్పథాలు కనిపిస్తున్నాయి. 1) ఫ్రాన్సిస్ ఫుకియామా చెప్పిన చరిత్ర అంతమైంది, ప్రజాస్వామ్యం నిలబడింది, అది కొనసాగి తీరుతుంది అనేది ఒకటి ఇవి ఇరవయ్యో శతాబ్దిని ఏలుతున్న ధోరణులు. 2) ఈ ప్రపంచంలో ఆరో, ఏడో నాగరకతలున్నాయి ఆధిపత్యం కోసం ఘర్షణ పడుతున్నాయని (Clash of Civilizations) శామ్యూల్ హాంటింగ్‌టన్ చెప్పిన ధోరణి రెండోది

ప్రజాస్వామ్య విషయంలో, అది ఉపాంతంలోనే కావచ్చు, గణనీయంగానే అభివృద్ధి చెందిందని చెప్పవచ్చు - కాని లోతులకు వెళ్ళి చూస్తే నిరాశే మిగులుతుంది. నేను కొన్ని అంకెలను చెబుతాను 1983లో ప్రపంచ జనాభాలో 36% జనం ప్రజాస్వామికాలని పిలవబడే సమాజాలలో ఉన్నారు 1998కి వచ్చేసరికి అది 39% కి పెరిగింది. అంటే 36% నుంచి 39% కి పెరిగింది అన్న మాట ఈ ప్రపంచ ప్రజాస్వామ్యీకరణం అంత సజావుగా జరగడం లేదనడానికి కావలసినంత సాక్ష్యం ఉంది సమకాలీన ప్రపంచాన్ని, దానిలోని ప్రజాస్వామ్య పాత్రను చూసి సంతృప్తి చెందిన వాళ్ళు, ఒకటికి రెండుసార్లు తిరిగి ఆలోచించుకోవాల్సిన తరుణం ఆసన్నమైంది వారు ఏదో ఒకటే చేయాలి, ఉమ్మడిగా వైయక్తికంగా. దీనికి కారణాలు తెలియరానంత దూరంలో ఏమీ లేవు

ప్రజాస్వామిక సంస్థలను నిర్మించడం చాల కష్టం. నిర్మూలించడం తేలిక 1975 - 77 లలో మనదేశంలో కొద్దిమంది వ్యక్తులు ప్రజాస్వామ్యాన్ని కూలదోసి 'రాజ' పాలనూ, ఆధి కారిక పాలనూ

మార్చివేశారు. స్వాతంత్ర్యాన్ని తిరిగి పునరుద్ధరించడానికి ఆసమయంలో తార్కుండే లాంటి వ్యక్తులు వీరోచితంగా పోరాడారు. ఆ తరవాత భారతదేశంలో అనేక రాష్ట్రాలలో అధికారిక పాలనిది పై చేయి కావడం చూస్తూనే ఉన్నాం మహారాష్ట్ర దీనికి మినహాయింపు కాదు.

తర్కబద్ధంగా, స్వేచ్ఛావాదమూ, ప్రజాస్వామ్యమూ రెండూ కలిసి పయనించాలని మనం సహజంగా అనుకొంటూ ఉంటాం. ఆధునిక, లౌకిక, ప్రజాస్వామిక ధోరణులు గూడ అలాగే కలిసి పయనిస్తాయను కొంటాం. కాని అప్పుడప్పుడు తర్కం వాస్తవాన్ని జీర్ణించుకోలేదు. అయొతుల్లా ఖోమైనీని చూడండి. లౌకిక ప్రజాస్వామిక వ్యతిరేకమైన 'మతఛాందసం' అక్కడ ఇరాన్‌లో నిలబడింది. అల్జీరియాను చూడండి టర్కీని చూడండి ఇంకా ఇలాంటి కొన్ని సమాజాలను చూడండి ప్రజాస్వామ్యాన్ని తోసిరాజని మత ఛాందసం రాజ్యం ఏలుతోంది. దీనిని వ్యతిరేకించే కొలది దేశాలు, ఆధునికత, లౌకికతల కోసం వ్యతిరేకిస్తున్నాయే గాని ప్రజాస్వామికం కోసం కాదు. ఇది మానవ వాదులకు, హేతువాదులకు, స్వేచ్ఛా ప్రియులకు చాల దయనీయమైన విషయం. తమాషా ఏమిటంటే టర్కీ ప్రభుత్వం సైన్యం చేతిలో ఉంది ఏది లౌకికమో, ఏది కాదో నిర్ణయించేది సైన్యం. వారు వాస్తవానికి లౌకికపాలనే చేస్తున్నారు. అది రైటో తప్పో నాకు తెలియదు. అది సరళం కావాలని నా ఆశ. కాని అది వాస్తవానికి చాల సంక్లిష్టమైన విషయం.

ఇది ఒక ప్రశ్నను లేవనెత్తుతుంది: ప్రజాస్వామిక సంస్థలా? ప్రజాస్వామిక సంస్కృతా? - ఏది? ఒక సమాజంలో ప్రజాస్వామిక సంస్థలున్నంత మాత్రాన, అక్కడ ప్రజాస్వామిక సంస్కృతి గూడా ఉంటుందనీ, ఉందనీ చెప్పలేం

ప్రజాస్వామిక సంస్కృతి అంటే ఏమిటో నేను కొద్దిగా వివరిస్తాను: 1) నా ఉద్దేశంలో అది అనుభవ పరమైన స్వేచ్ఛ. అంతేగాని రాజ్యాంగంలో పొందు పరిచిన హామీలు కావు. అది వాస్తవ స్వేచ్ఛ, యధార్థ స్వేచ్ఛ, అనుభవిక స్వేచ్ఛ, ఆచరణాత్మక స్వేచ్ఛ. 2) రెండోది అధికార దుర్వినియోగ నిరోధం. అధికారం ఎప్పుడూ అధికార దుర్వినియోగానికి అనుకూల మైన సన్నివేశాలను కల్పిస్తుంది, సృష్టిస్తుంది ఆ కీడును ఎదుర్కొనే, నిరోధించే సామర్థ్యం మనకు లేకపోతే, సైద్ధాంతికంగా ప్రజాస్వామిక సంస్థలు యధాస్థానాల్లో ఉన్నప్పటికీ, ప్రజాస్వామ్యం అంతరిస్తుంది. అంటే ఇహ అక్కడ ప్రజాస్వామిక సంస్కృతి లేనట్లే. 3) మూడోది అప్రియం కొని తెచ్చుకోకుండ అసమ్మతిని అభివ్యక్తం చేసే సామర్థ్యం. భారతీయ సమాజానికి ఉన్న దురదృష్టకర లక్షణం ఏమిటంటే ముష్టి యుద్ధాలకు, ఇతర రకాల ఘర్షణలకు దిగకుండ అసమ్మతిని తెలియజేసే సామర్థ్యం దానికి లేకపోవడం

ఆ తరవాత 'నమ్మకం' ప్రశ్న ఉండనే ఉంది. ప్రజలకు తమను తాము పాలించుకోగల సామర్థ్యం మీద, తమకేది మంచిదో, ఏది కాదో నిర్ణయించుకొనే సామర్థ్యం మీద ఉన్ననమ్మకం. ఇది అంతంత మాత్రమే! భారతీయ సమాజంలో పూర్తిగా మృగ్యమైన మరో విషయం 'సమానత్వం', ఇది ఆర్థిక సమానత్వమే కానక్కరలేదు. సమాజంలో ఏ వృత్తి చేపట్టినా, ఏ స్థితిలో ఉన్నా, ఆర్థికంగా ఎక్కడ ఉన్నా, ప్రతిష్ఠాగౌరవాల పరంగా అందరికీ ఉండాల్సిన సమానత్వం ఆసమానత్వం. ఏదో ఒకరకంగా, ఎక్కడో ఒకచోట, ఎవరికో ఒకిరికి అన్యాయం జరిగితే, అది ప్రత్యక్షంగానే పరోక్షంగానో నేడో రేపో

దాని ప్రభావం నా మీద పడి తీరుతుంది. అందుకని నేను మౌనం వహించడం కుదరదు ఇది అందరికీ సంబంధించిన సామాన్య విధి .

నేను ఇప్పుడు ఆర్థిక ఉదారీకరణను గురించి ప్రస్తావిస్తాను నేను చెప్పేది అంత సుసంగతంగా ఉండదు ఎందుకంటే పదిహేను నిముషాలలో ప్రపంచ ప్రజాస్వామ్యాన్ని గురించి, ఆర్థిక ఉదారీకరణ గురించి చెప్పడం సాధ్యం కాదు మీరు క్షమించాలి

ఆర్థిక ఉదారీకరణ ప్రజాస్వామ్య వికాసానికి దారితీస్తుందని చాల మంది విశ్వసిస్తారు. ఈ విశ్వాసానికి ఆధారాన్ని విశ్లేషించడం చాల క్లిష్టం అది కావచ్చు, కాకపోవచ్చు, భారతదేశాన్నే తీసుకొందాం. పర్మిట్ల రాజ్యం ఉన్నంతకాలం, ఈ విపర్యాస వ్యవస్థను అడ్డం పెట్టుకొని, రాజకీయ, బ్యూరోక్రటిక్ వర్గాలు డబ్బును దండుకొన్నాయి. ఇది అక్కడితో ఆగిపోక పైనుంచి క్రింది వరకు జాడ్యంలా పాకి పోయింది. ఈ లైసెన్సుల రాజ్యం పోయినా, అది అంటించిన లంచగొండి తనం కొనసాగుతూనే ఉంది. కాని ఈ లంచగొండితనం మరో రకంది. మరిదీనిని అరికట్టడంలో ప్రభుత్వానికి అపరిహరనీయమైన పాత్ర ఉంది. అయితే ఆ పాత్ర నిర్వహించి, చట్టాన్ని అమలు పరిచే మార్గం కనిపించడం లేదు. ఇంకా అనేక సమస్యలున్నాయి. ఇవ్వాళ రాజకీయులకు, నేరస్తులకు మధ్య సంబంధం రాను రాను దృఢతరం అవుతోంది. ఈ బంధం ఇంతకు ముందు లేదని కాదు కాకపోతే ఇది మరీ విచ్చలవిడిగా ఈనాడు పెరిగి పోయింది. దీనికి కారణం ఆర్థికశక్తి బాగా క్షీణించిపోవడం. అందుకని మన దూషణలను అభివ్యక్తం చేయడానికి నూతన మార్గాలను అన్వేషించాలి.

ఈ దేశంలో బొంబాయి నగరం ఉదార విలువలకు నిలయంగా పేరు మోసింది. కాని అది ఈనాడు రాజకీయాల - నేరస్థుల బంధానికి కేంద్రంగా పరివర్తితమైంది - ఇదే విషయం మనకు ఢిల్లీలో, పడమర ఉత్తర ప్రదేశ్‌లో, కరాచీలో, పాకిస్థాన్‌లో కనిపిస్తుంది. అది ఈనాడు ఇంతింతై అన్నట్లుగా ఈ దేశంలో అనేకచోట్ల దర్శనమిస్తుంది.

అందుకని మనం ప్రజాస్వామిక స్థిరత్వం కోసం ఇతర 'సహ పరిస్థితులను' సృష్టించక పోతే కేవలం స్వేచ్ఛా విఫణులు మాత్రమే ప్రజాస్వామ్యాన్ని మనకందించలేవు. రష్యా ఉదాహరణను తీసుకోండి. ఇప్పుడు దానిని గురించి నేను అంతగా వివరించను. ఈ విషయానికి తరవాత వస్తాను రష్యానుంచి మనం చాల నేర్చుకోవాలని నేననుకొంటున్నాను. ముఖ్యంగా భారతీయులైన మనం దాని నుంచి నేర్చుకోవాలి. అందుకని నాకేమనిపిస్తుందంటే 'మంచి పరిపాలన' ' అనేది అసలు కీలకం అది లేకుండ, కాగితంమీద లిఖితమైన ప్రజాస్వామిక సంస్థలు మనకు నిజమైన స్వేచ్ఛా ప్రజాస్వామిక సమాజాన్ని ప్రసాదించ లేవు. మంచి పాలన అంటే, రాజకీయ పార్టీలు బహిరంగంగా, మంచి స్త్రీ పురుషులను రాజకీయ ప్రక్రియలోకి దింపి, పుచ్చు, కుళ్ళు జనాలను తోసివేసి, ప్రజాస్వామ్యాన్ని నడిపించాలి. కాని మన భారతదేశంలో చాలవరకు దీనికి పూర్తిగా విరుద్ధంగా జరుగుతోంది నిజాయితీ పరులు, సభ్యత సంస్కారాలున్న ప్రజలు వాస్తవంలో ఎన్నిక గావడానికి వీలైన ఎన్నికల ప్రక్రియ ఉండాలి. ఇవ్వాళ ఒక తార్కుండే గాని, మహాత్మాగాంధీ గాని, పోటీ చేస్తే డిపాజిట్లు దక్కుతాయనే నమ్మకం లేదు.

మరేమో తరవాత వికేంద్రీకరణం జరగాలి ఈప్రక్రియ వల్ల తమ వోటుకు, తమ క్షేమానికి మధ్య ఉన్న సంబంధం ఏమిటో తెలుస్తుంది. పన్నులరూపంలో చెల్లించే డబ్బు ఏమవుతుంది? దాని వల్ల తమకు ఏమి సేవలు అందుతున్నాయి? తమకు కలిగే లాభాలు ఏమిటి? - వీటిని అర్థం చేసుకోవడానికి వీలవుతుంది అదే లేకపోతే ప్రజాస్వామ్యానికి అర్థమే లేదు. కేంద్రప్రభుత్వం, రాష్ట్ర ప్రభుత్వాలు కలిసి రోజుకు 1000 కోట్లు ఖర్చు పెడుతున్నాయని మనలో ఎంతమందికి తెలుసు? ఈ సమావేశం మొదలై కొనసాగుతున్న ఈ రెండు గంటల కాలంలో రెండున్నర కోట్ల నుంచి నాలుగు కోట్లు వరకు ప్రభుత్వాలు ఈ దేశంలో ఖర్చుపెట్టాయి. మరి ఈ డబ్బు ఏమై పోతోంది? అందులో ఎంతడబ్బు మనం చూడడానికి వీలైన పద్ధతిలో ఖర్చు అవుతోంది? మనకు మన పిల్లలకు మంచి జరిగేట్లు ఖర్చు జరగపోతే, ఖర్చు అయిన తీరుకు ఎవరు బాధ్యత వహిస్తున్నారో తెలియకపోతే, ఓటుకు సంక్షేమానికి పెట్టిన ఖర్చుకు సంబంధం మనకు తెలియకపోతే, ఖర్చు అయిన దానికి ఆఖర్చు వల్ల చేకూరిన లాభానికి సంబంధం మనకు తెలియకపోతే, తన్మూలంగా లభించిన సేవలు మనకందకపోతే, ప్రజాస్వామ్యానికి అర్థంలేదు అంతిమంగా జనం కోరుకొనేది చాల చిన్న సేవలు - కుళాయిలో నీరు సరిపోయినన్ని రావాలని, ఇళ్ళల్లో కరెంటు దీపాలు నిరంతరాయంగా వెలగాలని, మురుగు వ్యవస్థ సరిగా పని చేయాలని, పోలీసువారు సభ్యతతో ట్రాఫిక్‌ను నడపాలని, రక్షణ కోసం పోలీసు స్టేషన్‌కు వెళ్ళితే లాఠీ దెబ్బలు తగలరాదనీ, వారు కోర్టులకు వెళ్ళితే, ఇక్కడున్న న్యాయమూర్తులకు క్షమాపణలతో, వారి జీవిత కాలంలోనే న్యాయం పొందాలని ఆశిస్తారు. ఇవేమి లేని ప్రజాస్వామ్యాన్ని గొప్పగా చెప్పడం అర్థరహితం.

ప్రజాస్వామ్యంలో ఎక్కడికక్కడ సంస్థలు సరిగా కొనసాగుతున్నాయో లేదో చూడడానికి సరిచూసే సంస్థాగత యంత్రాంగం ఉండాలి. అలా ఉంటే ఏ సంస్థ ఎలాబడితే అలా విచ్చల విడి తనంతో పరుగులు తీయదు. ఇలా చూడవలసింది న్యాయంగా బ్యూరోక్రసీ కాని ఇది ప్రజలకు సేవికగా ఉండడానికి మారు, తనకుతాను సేవచేసుకొని, తన బాగోగులు తాను చూసుకొని, తన ఉనికిని నిరంతరాయంగా కొనసాగించడానికి తాను పాటు పడుతుంది. అదొక నిత్యస్వయం వర్ధమానపురోహిత వర్గంగా తయారవుతోంది. న్యాయ విభాగం అది చేయవలసింది అది చేయాలి. కాని అది చేస్తుందా?

ఇప్పుడు నేను నా ఉపన్యాస అంతిమ భాగానికి వస్తున్నాను. ఇంతకు ముందు ప్రస్తావించిన రష్యా విషయానికి వద్దాం - మనం దాని నుంచి ఎన్నో గుణపాఠాలు నేర్చుకోవలసి ఉంది. చాల మంది పాశ్చాత్యులు గోర్బచెవ్‌ను, ఎల్ట్సిన్‌ను గొప్పవాళ్ళుగా చెబుతారు వారు గొప్ప పాశ్చాత్య నాయకులన్న మాట నిజం. చాలకాలం పాటు అలా కొనసాగారుకూడా. గోర్బచెవ్ హీరోగానే ఇప్పటికీ పరిగణింపబడుతున్నాడు. కాని అతడు సోవియట్ రష్యాలో మాత్రం ఆ గౌరవానికి నోచుకోలేదు. ఈ బయట గౌరవింపబడం, లోపల ఆ గౌరవం లేకపోవడం - ఈ విరోధాభాస ఏమిటో మనకు అర్థం కావడం లేదు. వారు అతనిని ఏ పదవిలోనూ ఉండాలని కోరుకోవడం లేదు. ఇంతకు ముందు ఏమి జరిగింది? ఇప్పుడు ఏం జరుగుతున్నది? తప్పు ఎక్కడ జరిగింది? దశాబ్దాలుగా తాము మోసపోయామని తెలుసుకొన్నారు సోవియట్ ప్రజలు ప్రభుత్వం చెప్పింది చేయడం లేదని గ్రహించారు. నినాదాలలో పసలేదని గ్రహించారు. అక్కడి నియంతృత్వ పాలనలో వారు తమ నిరసన వెల్లువను బహిరంగంగా వెలువరించ లేకపోయారు. మనం అయితే, ఇక్కడ చాల సంతోషంగా ఆపని

చేయగలుగుతున్నాం ఏ సైబీరియాకో పంపుతారనో, కాల్చి చంపుతారనో భయం అయినా వారి ఈ వేదనలు ఏదో ఒక రూపంలో బయటపడక పోలేదు అప్పట్లో సోవియట్ యూనియన్‌లో ఒకజోకు ప్రచారంలో ఉండేది ఒక రేషన్ దుకాణం ముందు రొట్టెముక్కలు కోసం కొన్ని వందలమంది క్యూ కట్టి నిలబడ్డారు అది మాస్కో నగరంలో ఎముకలు కొరికే చలిలో ఎంతసేపు నిలబడ్డా క్యూ తరగడం లేదు సహనం చచ్చిపోయింది. ఇహ ఏమాత్రం సహనం వహించలేని యువకుడొకడు, ''నేను ఇప్పుడే వెళ్ళి క్రెమ్లిన్‌లో ఉన్న సెక్రటరీని చంపేస్తా'' నన్నాడు తతిమ్మావాళ్ళంతా నోరు మెదపలేదు నోరు మెదిపితే ఏమయ్యేది వారికి తెలుసు ఈ యువకుడు క్రెమ్లిన్‌కు వెళ్ళి తిరిగి వచ్చాడు. వారు అతనిని అడిగారు, ' ఏమైంది చంపివచ్చావా? క్రెమ్లిన్‌లో ఏమి జరిగింది. సెక్రటరీని చంపావా? అక్కడేమీ సమస్య ఎదురు కాలేదు గదా? మరి మనం షాపును లూటీ చేదామా? అతడు బదులు పలికాడు ''చూడండి నేను కార్యదర్శిని చంపుదామని వెళ్ళా గదా, నేను అక్కడికి వెళ్ళే సరికే ఇక్కడ కంటే అక్కడ పెద్ద క్యూ ఉంది వారంతా అతనిని చంపడానికి క్యూలో ఉన్నారు చేసేది లేక తిరిగి వచ్చాను''

కాని కోపం అభివ్యక్తం అయింది. కాలం పండింది మహాబలోపేతమైన అజేయమనుకొన్న సామ్రాజ్యం అనతికాలంలో కుప్పకూలి పోయింది సరైన సమయంలో సోవియట్ ప్రజలు గాని, ప్రభుత్వం కాని, ప్రభావకమైన ఇతర సంస్థలు గాని, సరైన చర్యలు తీసుకోలేదు భవిష్యత్తును దృష్టిలో ఉంచుకొని భవిష్యత్తుకు జాగ్రత్తపడే సంస్థలను (Instituitions) వారు నిర్మించలేక పోయారు నిన్నటి రష్యాకంటే నేటి రష్యా కొంత 'మెత్త'గానే ఉంది. అయినా ఈ నాటి రష్యన్లను మీరు కదిలిస్తే, వారు తాము ఇప్పటి రష్యాలో ఉండడం కంటె నిన్నటి రష్యాలో ఉండడానికి ఇష్టపడతామని చెబుతారు

ప్రజాస్వామ్యాన్ని ఒక సంస్థగా పరిగణిస్తే దానితో పేచీ ఏమీలేదు ఉన్న పేచీ ఎక్కడంటే, సరైన పరిపాలకతను, ప్రజాస్వామిక చట్రాన్ని నిర్మించి ఇవ్వలేని దాని అశక్తతలో ఉంది

అంతిమంగా నేను విన్నవించేదేమంటే భారతదేశ స్థితి నిన్నటి రష్యా స్థితి కంటె భిన్నంగా లేదు కాశ్మీర్ నుంచి కన్యాకుమారి వరకు, గౌహతి నుంచి గంగా నగర్ వరకు, లక్షలాది భారతీయులు కులం, మతం, భాష, వర్గం, అంతస్తు అనేవి లేకుండా అందరూ అదే వేదనను అనుభవిస్తున్నారు. ఈ దేశంలో స్థాపిత ఆధికారిక యంత్రాంగానికి వ్యతిరేకంగా కోపం పెల్లుబికి వస్తోంది. నేరీకరణకు, లంచగొండి తనానికి, కేంద్రీకరణకు, ప్రభుత్వం ప్రజలకు చెప్పకుండా దాచే రహస్యాలకు, పరిపాలన పేరుతో ప్రభుత్వం చేసే అనేక చెడులకు వ్యతిరేకంగా, కోపం ఆపుకోలేని దశకు వస్తోంది. ఇప్పుడు సమయం ఆసన్నమైంది. ఈ సమయంలో, ఈ 'ధార్మిక కోపా'న్ని, నిర్మాణాత్మకమైన, పనిచేయగల, అర్థవంతమైన సంస్థలను (Instituitions) నిర్మించి, వాటిల్లోకి మళ్ళించ జాలకపోతే, ప్రజాస్వామ్యానికి భరతవాక్యం పలికినట్లే. మనదేశం గూడ సోవియట్ మార్గాన్ని అనుసరించి విచ్ఛిత్తి చెందకమానదు.

అదొక అద్భుత ఆశ్చర్యం, భారతీయ సమాజంలాంటి చాలా పెద్ద పెద్ద సమాజాలు ఎలా 'ఒకటి'గా ఉండగలుగుతున్నాయా అని. దీనిని మనలో చాలమందిమి దత్తాంశంగా తీసుకొంటాం.

మానవ యాంత్రిక శాస్త్రం (Human Engineering) గాఢ అంతర్దృష్టితో, నిబద్ధతతో, ఒకరాగంతో, వాస్తవ ముఖ్యపాత్రను నిర్వహించక పోతే, ఈ అద్భుతం ఎన్నాళ్ళో కొనసాగదు

నేను అత్యంతంగా మెచ్చుకొనే రాస్ అనే కవి వ్రాసిన పద్యం చెప్పి, నా ఉపన్యాసాన్ని ముగిస్తాను మనం ఒక పని చేయాలనుకొన్నప్పుడు దానికి ఎదురయ్యే ఆటంకాలు - అజ్ఞానం, భయం, ఒకరకం శిష్టవాదం (elitism)లాటివి వున్నాయి భారతదేశంలాంటి దేశంలో మనం అన్నీ చేస్తాం-, మాటాడతాం, విమర్శిస్తాం, బౌద్ధీకరణ (intellectualise) చేస్తాం, కాని మనం చేతులకు మట్టి అయ్యే పనులలో, నిర్మాణాత్మక పనులలో వేలుపెట్టం ఎందుకంటే ఈ దేశంలో మనం వేరుగా నిర్మితుల మయ్యామని భావిస్తాం. సామాన్య జనం మనకంటె వేరుగా నిర్మితులయ్యారను కొంటాం అందుకని 'సామాన్య రాశి జనం' చేసే పని మనం చేయకూడదు అందుకని దేనిమీదైనా నిరసన తెలపడానికి సామాన్యులలా మనం వీధులలో పడం. 'తప్పు' కు వ్యతిరేకంగా మనం ప్రదర్శనలు జరపం మన నిర్మాణమే వేరనుకొంటాం.

నేనొక మాట తిన్నగా చెబుతాను మనం 'దూడ అడుగులు' (Calf paths) అని రాస్ చెప్పిన 'మనస్సు సాలెగూడుల' నుంచి బయట పడాలి దూడ అటు ఇటు గెంతుతూ చంగ్రాలు తీసింది. దూడలు మామూలుగా సరిగా తిన్నగా నడవవు ఆరోజు అంతకు ముందు వర్షం కురిసిందేమో దాని అడుగులు నేలమీద పడ్డాయి మరు రోజు బాగా ఎండకాయడంతో దాని అడుగులు స్పష్టంగా కనిపించ సాచ్చాయి ఆ తరవాత కొన్నిరోజులకు ఆ అడుగుల మీదుగా ఒక పశుపాలకుడు నడిచాడు తరవాత కొద్దిరోజులకు గోపాలుడు నడిచాడు. అలా కొన్ని నెలలకు నడవ పడింది. ఆ తరవాత కొద్ది సంవత్సరాలకు అక్కడొక గ్రామం వెలిసింది అది పెద్ద పట్టణమైంది ఆ దారి వేలకు వేల జనాభాకు 'దారి' అయింది దూడ చచ్చిపోయిన మూడు శతాబ్దాలకు, కవి చెప్పినట్లుగా, ఆదారి వారికి 'దారి' అయింది. బాగా పాదుకుపోయిన ఒక పూర్వ ఘటన మార్గనిర్దేశకత్వానికి అంటే పాతకు మనం ఇచ్చే గౌరవం అది. పాతనే అంటి పెట్టుకుపోతాం మనస్సు సాలెగూడుల నుంచి బయట పడం ఏండ్లు పూండ్లు నాడు పుట్టి చచ్చిపోయిన భావాలే మనకు ఆదర్శం - మనదేశంలో ఇప్పటికీ జరిగేది ఇదే - చాల ఇతర దేశాల్లో గూడ ఇదే జరుగుతుందని నేననుకొంటున్నాను.

ఇప్పుడు 'దూడ అడుగుల'ను తుడిచి పెట్టి, ఆధునిక ప్రపంచంలో, మనమూ భవిష్యత్తులో మన పిల్లలూ ఇనుమడించిన గౌరవ ప్రతిష్ఠలతో తలెత్తుకొని నిలబడి, ఆధునిక సమాజాలు అందించగల సౌకర్యాలతో, జీవించడానికి వీలుగా ఆధునిక సంస్థలను నిర్మించాల్సిన సమయం ఆసన్నమైంది. పనిలోకి దిగడానికి సమయం ఆసన్నమైంది ఇప్పుడు మనం పనికి ఉపక్రమించక పోతే, భారతదేశం గూడ, 61% అప్రజాస్వామిక 'మానవరాసు' ల్లో, ఒక మానవరాశి అయిపోతుంది. 39% ప్రజాస్వామికం జనాభా 23 శాతానికి పడిపోతుంది. అప్రజాస్వామిక జనాభా 77% నికి పెరుగుతుంది. నేను మీకు నమస్కరించి చెబుతున్నాను, ముఖ్యంగా భారత ప్రజలకు, ఈనాడే రంగంలోకి దిగండి ఉమ్మడిగా ఉద్యమించండి.

చొరవ చూపండి. మిమ్మల్ని మీరు అవుననిపించుకొండి. అందరికి అభివాదాలు

# గిడుగువారి మానస పుత్రులు పురిపండా...

– విరియాల లక్ష్మీపతి.

భావకవిత్వపు అంతిమ దశకి అభ్యుదయ సాహిత్యం ఆరంభదశకి గల సంధి యుగంలో ఐదుగురు మహారథులు తెలుగు సాహిత్యంలో రంగప్రవేశం చేశారు తెలుగు సాహిత్యాన్ని వాడుక భాషతో రంగరించి ప్రకాశింపచేశారు తెలుగు భాషకి ఛందోశ్శృంఖలాల పాతకాలపు అందాలు, నగలు తొలగించి కొత్త అందాలు అందించారు గిడుగు రామ్మూర్తి పంతులు గారు అందించిన వ్యవహారిక భాషా ఉద్యమాన్ని వారు ఐదుగురూ భుజాలకి ఎత్తుకొని ఉత్తమ వారసత్వంగా స్వీకరించి తెలుగు సాహిత్య సీమలలో వైతాళికులుగా ప్రసిద్ధి చెందారు వారు 1904వ సం॥లో జన్మించిన పురిపండా అప్పలస్వామి, 1908లో జన్మించిన శ్రీరంగం నారాయణబాబు, 1910లో జన్మించిన శ్రీరంగం శ్రీనివాసరావు, 1912లో జన్మించి శిష్ట్లా ఉమామహేశ్వరరావు, 1915లో జన్మించిన పరాభి ( ప్రఖ్యాత కవి, విమర్శకులు డా॥ సోమసుందర్ మాటల్లో చెప్పవలసి వస్తే) కలసి వీరంతా కవితా పంచ పాండవులు ఈ పంచ పాండవుల్లో పురిపండా ధర్మనందనుడు, శ్రీరంగం నారాయణబాబు భీముడు, శ్రీశ్రీ అర్జునుడు, శిష్ట్లా నకులుడు, ఇంక పరాభి సహదేవుడు

వీరిలో పాండవాగ్రజులయిన పురిపండా ముమ్మూర్తులా ధర్మనందనులే సకల సాహితీ సంస్థలతోనూ కీర్తించబడిన అజాతశత్రువు గిడుగు రామ్మూర్తి పంతులు గారికి సాక్షాత్తూ మానస పుత్రుడు అభ్యుదయ సాహిత్యోద్యమానికి కడ ఊపిరి పీల్చుకున్నంతవరకూ నాయకత్వం వహించిన మహావ్యక్తి భారత, భాగవత, రామాయణాల్ని వాడుక భాషలో రచించి ప్రజల జీవ భాషను ప్రచారం చేయడానికి తాను అంకితమైన సత్యవాది ప్రథమ స్వాతంత్ర్యపోరాట చరిత్రను పరిశోధించి సాధికారంగా ప్రచురించి ప్రజల కందించిన జాతీయవాది పురిపండా. హిందీ, బెంగాలీ, ఒరియా, సంస్కృత భాషల్లో పండితులు, సాహిత్య అకాడమీ అభ్యర్థనతో ఒరియా భాషలలో గల ఉత్తమ రచనలు తెలుగు భాషలోకి, తెలుగు సాహిత్యాన్ని ఒరియా భాషకీ అనువదించి అందించిన సాహితీవేత్త.

బురుజు మీద బొల్లి గద్ద
బురుజు క్రింద కృకలాసం
కుబుసం వదిలిన సర్పం
ఇది విప్లవ సంకేతం
చిరువాంచిత సంక్షోభం

నాగీతం పులి పంజా అని 1930 నాటికే దేశాన్ని పాలించే తెల్లవారి మీద పులి పంజా ఝుళిపించిన విప్లవవాది. భారత దేశానికి సైమన్ కమీషన్ ప్రవేశించినపుడు, సహాయ నిరాకరణోద్యమానికి దేశ ప్రజలు ఆయత్తం అవుతున్న సమయంలో ఎంతోమంది భారతీయ కవుల గళాలు విప్లవ శంఖాలు పూరించాయి. ఆంధ్రదేశంలో కొత్తగొంతులు సవరించుకుంటున్న మొదటి తరం కవులలో పురిపండా అగ్రశ్రేణి కవులు.

పూర్వ భారతీయ సమాజం తమలో కొందరు మానవుల్ని అంటరానివారిగా బహిష్కరించి నిష్కృతిలేని మహాపాపానికి ఒడిగట్టింది. ఈ అస్పృశ్యతా ఛాందసభావం వికృతబానిసత్వంగా మారి మానవత్వాన్ని మంట గలిపింది. ఇది పరిసమాప్తం అయితే తప్ప జాతి విముక్తికి ఐక్య పోరాటం సాధ్యం కాదని మహాత్ముడు గ్రహించి 1920నుండి హరిజనోద్ధరణకు పిలుపు ఇచ్చారు దేశం

నలుమూలలా పర్యటించి అంటరానితనం సాంఘిక దురాచారం అని ఎలుగెత్తి చాటారు ఆ ఉద్యమంలో భాగంగానే గాంధీజీ 1936లో విశాఖ అరుదెంచారు మాగంటి బాపినీడు గాంధీజీకి కార్యదర్శిగా వ్యవహరించారు. విశాఖలో ఖాదీ ఉద్యమానికి ఆనాటి రోజుల్లోనే పురిపండా కార్యదర్శిగా క్రియాశీల కార్యక్రమాలలో చురుగ్గా పాల్గొన్నారు

గాంధీజీ విశాఖటౌన్‌హాలులో మీటింగు జరుపనున్న సమయానికి పురిపండా 'గుడిలోని దైవమా' అనే కవిత రచించి దాన్ని కరపత్రంగా అచ్చువేసి ఆసభలో సభాసదులందరికీ అందించారు ఆ కవిత ఇంగ్లీషు అనువాదం పురిపండా గాంధీజీకి వినిపించి మహాత్ముని మన్ననలు అందుకున్నారు.

ఒక ప్రక్క గాంధీజీ స్ఫూర్తిని అందుకొని పురిపండా తన యావత్‌కాలాన్ని ఖాదీ ఉద్యమ నిర్వహణకి అంకితం చేస్తూ రెండో ప్రక్క కవిగా విశాఖలో కవితా సమితి అనే సాహితీ సంస్థను స్థాపించి జన హృదయాల్ని జాతీయోద్యమం వైపు మళ్లించే అద్భుత కవితలను ఆవిష్కరించారు.

ఆ కవితల పుస్తక రూపమే పులిపంజా.

లండన్‌లో డాక్టర్ గూటాల కృష్ణమూర్తిగారి ఆధ్వర్యంలో నెలకొల్పిన విదేశాంధ్ర ప్రచురణల ప్రధమ సంకలనమే పురిపండావారి పులిపంజా. .

పుస్తకం విలువ రచన వెల్లడి చేసినట్టే, రచన విలువ పుస్తక స్వరూపం వెల్లడి చేయాలన్న లక్ష్య సిద్ధికోసం ఆవిష్కరించిన ఈ సాహితీ సంస్థ అమర పదకల్ప క్రమంగా 1976లో పులి పంజా పుస్తకాన్ని సర్వాంగ సుందరంగా ప్రచురించారు. పురిపండా ఇందులో 41 కవితలు సంకలన పరచారు. అందులోని ప్రతికవితకీ ఒక చారిత్రక నేపథ్యం ఉందని మామిత్ర బృందానికి వివరించేవారు అన్ని కవితల్లోనూ పురిపండా వాడుక భాషనే ఉపయోగించారు అన్నది పాఠకులకు స్పష్టంగా గోచరిస్తుంది.

వీరు విశాఖలో కవితా సమితి కార్యకలాపాలలో తలమునకలయిన కాలంలోనే కాశీనాధుని నాగేశ్వరరావు పురిపండాని ఆంధ్రపత్రిక విలేకరిగా విశాఖ జిల్లా ప్రాంతానికి నియమించారు. ఎంతో మంది యువ కవుల్ని భారతికి పరిచయం చేశారు 1925లో స్వాతంత్ర్య సమరయోధుడు కర్రా సీతారామయ్యగారు స్థాపించిన 'స్వశక్తి' జాతీయవారపత్రికకు పురిపండా సంపాదకత్వం వహించారు. ఖద్దరు వడకడం దగ్గర నుండి నవ్య సాహిత్య ప్రయోగాల వరకూ పురిపండా ఆ పత్రికలో పొందుపరచి జాతిజనులకు జాతీయతాబావాన్ని ఉద్దీపన చేశారు

అవి 1925వ సం॥ అక్టోబరు రోజులు స్వశక్తి వార పత్రిక ఆంధ్రావనిలో చైతన్య వీచికలు వీస్తున్నరోజులు. స్వశక్తి పత్రిక మీద శ్వేతజాతి ముష్కరులు కత్తులు దూస్తున్న సమయం. ఒకనాడు పురిపండా పత్రిక నిర్వహణలో తల మునకలయి కార్యాలయంలో కూర్చొని సంపాదకత్వం సరిచూసుకుంటున్నారు. ద్వారం దగ్గర తలుపుగొళ్లాం చప్పుడయ్యింది, పురిపండాద్వారం కేసి చూశారు. పదిహేనేళ్లు నిండిన కుర్రాడు, లేత వయస్సు, నున్నటి దేహం, కాంతి వెదజల్లేకళ్లు, తెల్లటి బుగ్గలతో నిగనిగలాడుతూ బక్క పలచగా వున్నాడు. ద్వారం దగ్గరనుండి పురిపండాకి నమస్కరించాడు. పురిపండా ఆకుర్రాడ్ని లోపలికి రమ్మని సైగ చేశారు. మళ్లీ తన పనిలో నిమగ్నం కాబోతూండగా యువకుడు దగ్గరగా వచ్చి జేబులోంచి ఒక కాగితం తీసి పురిపండాకి అందించాడు పురిపండా ఆ కాగితం మడతలు విప్పి చూశారు. అది ఒక పెద్ద గీతం. శీర్షిక 'విశ్వరూప సందర్శనం' అన్న గీతమాల. క్రిందసంతకం చూశారు పురిపండా. 'ఎవరీయన మీ అన్నగారా...?' అన్నారు. 'కాదండి అది నాపేరే....

అది నా రచనే' అన్నాడు యువకుడు ''నిజంగా ఇది నువ్వు వ్రాసిందేనా ?'' అన్నారు పురిపండా గద్దించి '' ''అవునండి నేను రాసిందే అన్నాడు యువకుడు ధైర్యంగా యవ్వనారంభంలోనే అంత విశిష్ట కవిత రచన చేయగలిగిన ఆ కుర్రాడ్ని పురిపండా మనస్సులోనే అభినందించారు భావితరాలలో ఆయన కవి క్రాంతిదర్శి కాగలడని విప్లవ సాహిత్యోద్యమానికి శ్రీకారం చుడతాడని ఊహించారు ఆ కవితను ప్రచురించి ఆయువకుడ్ని కవిగా అచ్చేసి దేశం మీదకు వదిలిన ఘనతను సాధించారు పురిపండా ( ఆమహాకవి అన్నమాటలే)

అనతికాలంలోనే ఆయువ కవి మహాకవిగా విశ్వరూప సందర్శనం చేసి పురిపండా ఊహ అపోహ కాదని ఋజువు చేశాడు

1932వ సం॥రంలో హరీంద్రనాద్ ఛటోపాధ్యాయ విశాఖ టౌన్ హాలులో Grave Diggers అనే అద్భుత నాటకాన్ని ప్రదర్శించారు. ఆనాటికే ఆనాటకం దేశం నలుమూలలా ప్రదర్శించబడి స్వాతంత్ర్య పోరాటానికి స్ఫూర్తి కలిగించింది కవితా సమితిలోని యువకవులు, రచయితలు ఆనాటి నాటక నిర్వాహకులు వాలంటీర్లు, ''శురూహువా హైజంగ్ హమారా' అనే పాటతో ఖడ్గ సృష్టితో నిప్పులు చెరుగుతూ పిడుగులు కురిపిస్తూ హరీన్ ఛట్టో వేదిక మీదకు వచ్చి తన హావ భావ నాటనా వైదుష్యంతో ప్రేక్షకుల్ని మంత్రముగ్ధుల్ని చేశారు నాటి హరీన్ ఛట్టో ప్రభావం యువకుల మీద అపారంగా పడిందనే ఈ ఉదంతం పురిపండా తన దగ్గరకువచ్చిన ప్రతి యువ కవికీ అప్పుడే జరిగినంత గొప్పగా అభివర్ణించి చెప్పేవారు

పురిపండాకి డెబ్బయి అయిదేళ్లు నిండిన సందర్భంగానూ వాడుక భాషా ఉద్యమం డెబ్బయి సం॥రాలు పూర్తి చేసుకున్న సందర్భంగాను అభ్యుదయ రచయితల సంఘం వజ్రోత్సవ వేడుకలు చేసుకొని పురిపండాను విశాఖలో ఘనంగా సన్మానించింది

పురిపండా నిత్యయవ్వనులు. స్నేహశీలి

నవ సాహిత్యమంత విశాలమైంది వారి కౌగిలి.

కవితా సుగంధం గలవారిని ఎంతమందిని వారు కౌగిలిలో

చేర్చుకున్నా ఎప్పుడూ మరో యువకవికి తన కౌగిలి

సిద్ధంచేసి అందులో చోటుంచేవారు

ఏక్షణంలో ఏమహాకవి ఉద్భవించి తన కౌగిలిలోనికి

వస్తాడో అని ఆశగా గుమ్మం దగ్గరే వాలు కుర్చీ వేసుకొని ఎదురు చూసేవారు.

గిడుగు రామ్మూర్తి గారి వ్యవహారిక భాషా మహోద్యమాన్ని అన్నిరంగాలలోనూ ఆవిష్కరించ డానికి తన యావ జ్జీవితాన్ని అంకితం చేశారు

గ్రాంధిక భాషనే గ్రంథస్థ భాషగా నిర్ణయించిన ఛాందసుల మీద అవిరళ పోరాటం సాగించిన మహావీరులు. విశ్వవిద్యాలయాల్లో ప్రశ్న పత్రాలు, పరిశోధనా పత్రాలు వాడుక భాషలో కూర్పు చేయడానికి అనుమతి గెలుపొందిన నవ్యసాహితీ విజేత.

గిడుగు రామ్మూర్తి పంతులు గార్కి సాక్షాత్తూ మానస పుత్రులు పురిపండా అప్పలస్వామి చిరస్మరణీయులు.

విశాఖలో జన్మించడం, వారి గురుత్వం లభించడం వారి సారధ్యంలో వాడుక భాషా ఉద్యమంలో పాల్గొనడం ఒక అదృష్టంగా భావిస్తూ వారికి ఈవ్యాసం జన్మదిన కానుకగా సమర్పిస్తున్నాను

# జిజ్ఞాసలో ఓ భావన

- కొండిపర్తి శేషగిరిరావు

విజ్ఞాన జగత్తులో

జిజ్ఞాసా జగత్తులో

ప్రతి అంశమూ మరో అంశానికి అనుబంధంగా ఉంటుంది. అవి ఒకదానికి మరొకటి పెనవేసుకొని కూడా ఉంటాయి. ఇంకా పరిశీలిస్తే, కొన్ని సందర్భాలలో ఒక అంశానికి మరో అంశమేకాదు, ఎన్నో అంశాలు పెనవేసుకొనికూడ ఉంటాయి. కొన్ని సందర్భాలలో కొన్ని అంశాలు సంఘటితమౌతూ ఉంటాయి. ఆ సంఘటితాలు ఒక అంశానికి బహిర్గతంగానేకాదు అంతర్గతంగానూ ఉంటాయి అంతర్గతంగానే కాదు అంతః సూత్రంగా కూడా ఒకోసారి ఉంటాయి.

ఇంత విస్తృతిగల ఈ విజ్ఞాన జిజ్ఞాసా జగత్తులో, ఒక అంశము, ఒక అంశాన్నిగానీ లేక కొన్ని అంశాలను గానీ వికర్షిస్తుంటుంది. ఇది ఆ విషయానికి బహిర్గతంగానూ అంతర్గతంగానూ జరగవచ్చు. అదే సమయంలో ఒక అంశముతో వికర్షింపబడిన అంశాలు మరొక విషయంతోగానీ మరికొన్ని అంశాలతోగానీ ఆకర్షింపబడుతూ ఉంటాయికూడా

విజ్ఞాన జిజ్ఞాసా జగత్తులలో ఇది ఒక దృష్టి ఒక దృక్పథం మాత్రమే.

ఈ ఆకర్షణ వికర్షణలు సంఘటితాల వలననే కాకుండా మిళిత సంఘటితాలు కూడా ఈ విజ్ఞానంలో ఈ జిజ్ఞాసలో ఉంటాయి. ఒక అంశ మరో అంశతో మిళితమైనప్పుడు సంయోగాన్ని స్వీకరించిన అంశము యొక్క పరిమాణం పెరుగుతుంది. సాంద్రమూ అవుతుంది. అది నూతనంగానూ ఉంటుంది, లేక మరో నూతనమైన అంశంగానూ అది రూపొందవచ్చు.

విజ్ఞానంలో జిజ్ఞాసలో ఈ ఆకర్షణ, వికర్షణ, మిళిత సంఘటనలు నిశ్శబ్దంగానూ జరగవచ్చు అవి అధికంగా సంఘర్షణాత్మకంగానే జరుగుతుంటాయి ఆ సంఘర్షణ శబ్దగతి శీలతలోనే విజ్ఞానం జిజ్ఞాసా జములుగా పెరుగుతూ పటిష్టవౌతున్నాయి. ఈ రెండు జగత్తులలోని అంశాల సంఘటితాలలోని ఆకర్షణ వికర్షణ మిళితాలలో, వికర్షణలోని శబ్దాలే అధికంగా మనకు వినిపిస్తాయి. కానీ ఆకర్షణలోనూ, మిళితంలోనూ నాదాలు లేకపోలేదు. ఆ సవ్యనాదాలు వికర్షణ సంఘర్షణలలోని నాదాలంత చిక్కగానే ఉంటాయి.

వైజ్ఞానికి జిజ్ఞాసా జగత్తులలోని ఆకర్షణ, వికర్షణ, మిళిత, సంఘటనలలోని శబ్దాలకు అక్షరరూపంలో జిజ్ఞాసువులు సశబ్దంగా లోకానికి వైజ్ఞానిక తాత్విక రూపాలలో అందిస్తారు.

★ ★ ★ ★ ★

పరమాణువులోని ఎలక్ట్రాన్స్, న్యూట్రాన్స్ వివిధ వలయాలలో న్యూక్లియస్ చుట్టూ పరిభ్రమిస్తున్నట్లు; విజ్ఞాన జిజ్ఞాసలలోని అన్వేషణ అనే కేంద్రకము చుట్టూ వివిధ అంశాలూ పరిభ్రమిస్తుంటాయి. ఆ అన్వేషణను కేంద్రం (న్యూక్లియస్)గా తీసుకొని దాని చుట్టూ అంశాలు పరిభ్రమించినా, ఒక నిర్ణీత పరిభ్రమణ చట్రంలో పరిభ్రమించాలి అనే నియమం ఆ అంశాలకు

లేకుండా అవి స్వేచ్ఛగా పరిభ్రమిస్తూ ఉంటాయి. అయితే పరమాణువులలో లాగా ఆ పరిభ్రమణ భ్రమణాలు ఢీకొనవు వాటిల్లో ఆకర్షణ, వికర్షణ, మిళితాలు కొన్ని సంఘర్షణలు మాత్రమే జరుగుతాయి ఈ వైజ్ఞానిక జిజ్ఞాసా జగత్తులలో అందుకనే వీటిల్లో ఎప్పుడూ నూతన సిద్ధాంతాలు ఉత్పత్తి అవుతుంటాయి అలా కానప్పుడు అన్వేషణలో స్తబ్దత సంఘటితమౌతుంది

పరమాణువు విచ్ఛేదమువలన గొలుసు కట్టు ఏర్పడినట్లు, విజ్ఞాన జిజ్ఞాసలలోని అన్వేషణా విచ్ఛేదనము వలన, ఆ విశ్లేషణలోనుంచి ఎన్నో అంశాలు గొలుసుకట్టుగా వ్యక్తమౌతూ వ్యాప్తమౌతాయి

జీవకణ విచ్ఛేదనము వలన అది రెండు కణాలుగా పరిణతి చెంది, అలా చెంకదూ, అవన్నీ సంశ్లేషింపబడుతూ ఒక సజీవ రాసిగా ఏర్పడినట్లు, విజ్ఞాన జిజ్ఞాసలలోని అన్వేషణ విభజింపబడి పెరిగినప్పుడు అంశాలు విస్తృతమవ్వటమే కాకుండా, అవన్నీ సంశ్లేషింపబడి ఒక నూతన అన్వేషణగా జన్మనెత్తుతాయి జీవకణములోనూ, పరమాణువులోనూ గల న్యూక్లియస్ కేంద్రకముగా ఉన్నట్లు, అన్వేషణ అను కేంద్రకము చుట్టూ వున్న అంశాలు ఆవృత్తమయి పరిభ్రమిస్తుంటాయి. ఆ అంశాలు భావాణువులను ఉద్భవింపజేస్తుంటాయి

సజీవ నిర్జీవ పదార్థాలలో అణువులూ కణాలూ ఎలా అచేతన చేతన పదార్థాలకు మూలమో, అలానే విజ్ఞాన జిజ్ఞాసలలో అన్వేషణా అంశాలు మూలము అణువులోని పరమాణువుల సంఖ్యను మారిస్తే, ఆ పదార్థతత్వం మారినట్లు, జీవకణములో క్రోమోజోముల జతల సంఖ్యను మారిస్తే జీవజాతి మారినట్లు, విజ్ఞాన జిజ్ఞాసలలో అన్వేషణారీతులను విభిన్న తత్వాలు గల అంశాలను మారిస్తే జిజ్ఞాసలలోని తత్వాలుమారి ఒక విషయం, ఒక శాస్త్రత మరో విషయంగానూ, ఒక శాస్త్ర మరో శాస్త్రతగానూ మారుతుంది. అంత శక్తివంతమైనవి ఈ అన్వేషణలూ, అంశాలూ, వాటి అణువులూ

అంతేకాదు పరమాణువులోని ఎలక్ట్రాన్స్, న్యూట్రాన్స్ మొదలైన వాటి నిష్పత్తులకీ, వాటి పరిభ్రమల వలయాలకూ వేగాలకూ కాస్త కదలింపు జరిగితే, వినూత్నమైన శక్తి ఉత్పన్నమైనట్లే, విజ్ఞాన జిజ్ఞాసలలోనూ కాస్త కదలింపు జరిగితే, నిత్యం అనివార్యంగా జరిగే సంఘటితాలవల్ల వినూత్నమైన అంశాలు ఉత్పన్నమౌతాయి

★ ★ ★ ★ ★

ఈనాడు చేతన అచేతన పదార్థాల మధ్య ఒక గీతగీయటం కొంత కష్టసాధ్యమైనపని అని చెప్పిన సత్యాన్వేషణ, ఈ విజ్ఞాన జిజ్ఞాసలలోని భావాణువులు జ్ఞాన పరమాణువులు గలవి ఎందుకంటే ఈ జీవ నిర్జీవ పరమాణువులలో చైతన్యం అన్నది ఉన్నది కనుక. ఆ చైతన్యం జడచైతన్యం కావచ్చు, జీవచైతన్యం కావచ్చు. అందుకని చేతన అచేతన పదార్థాలను విశ్లేషించి సత్యాన్వేషణ చేసేది జ్ఞాన పరమాణువు. జ్ఞాన పరమాణువు అన్నది పరమాణువు జీవాణువులకు విభిన్నమై ఉండి, ఆ రెండు అణుతత్వాలకు కలియనిది. అయినప్పటికీ, ఆ రెండూ ఎంత శక్తివంతమైనవో అంత శక్తివంతమైనది ఈ జ్ఞానాణువు. అందుకనే ఈ రెంటి మధ్యా విశ్లేషణలను చేసి చేసి తుదకు తన సత్యాన్వేషణలో ఆ రెంటిమధ్య ఒక నిర్దిష్టమైన గీతను గీయటం మిగుల కష్టసాధ్యమైనపని అని అన్నది.

సూక్ష్మంగా పరిశీలిస్తే ఈ జ్ఞానపరమాణువు అచేతన పదార్థంలోని పరమాణువులోని తత్వాన్నీ, చేతన పదార్థంలోని జీవకణంలోగల తత్వాన్నీ కలిగి ఉన్నది పైగా ఆ రెంటి మాదిరిగా ( జడ అజడ పదార్థాలు) ఆ రెండు పరమాణువులు ఎంత అనాది తత్వాన్ని కలిగి ఉన్నాయో, ఈ జ్ఞానాణువుకూడ అంతే అనాది తత్వాన్ని కలిగి ఉన్నది వాటి మాదిరిగానే ఇదీ వ్యాపకత్వ, అవినాశి, అనంత తత్వాలను కూడ కలిగి ఉన్నది పరమాణువులూ జీవాణువులూ అందలి సూక్ష్మాంశములు ఒకదశలో ఎలా స్వయంభువులో,-ఈ జ్ఞానాణువులు కూడా అందలి సూక్ష్మాంశములూ అలానే స్వయభువత్వాన్నీ నిత్యత్వాన్నీ కలిగి ఉన్నాయి

అందుకని ఈ విశ్వంలో పరమాణువులు, జీవాణువులు, జ్ఞానాణువులు అన్నవి ఉన్నాయి ఈ మూడు అణువులు ఈ విశ్వానికి మూలం, అని జిజ్ఞాసాణువు సత్యాన్వేషణతో గుసగుసలాడుతోంది అన్వేషణా జగత్తులో.

వైజ్ఞానిక జగత్తులోని పరిశోధనలు అన్నిటిలోనూ ఈ జిజ్ఞాసాణువులే చోదక శక్తిగా పనిచేస్తుంటాయి. లేకపోతే వైజ్ఞానిక జగత్తులో పరికర పరిమితే అయి ఉండేది అందుకనే, ప్రతి వైజ్ఞానిక శాస్త్రవేత్తనూ లేక వైజ్ఞానిక అన్వేషకునీ ఈ జిజ్ఞాసాణువులే అతన్ని వైజ్ఞానిక పరిశోధకునిగా నడిపేది. లేకపోతే అతను అతి సామాన్యమైన వైజ్ఞానిక శాస్త్రం చదువుకున్నవాడుగానే ఉండిపోయేవాడు

పరమాణువులు, జీవాణువులు ఒక దశలో ఎలా స్వయంభువులో, అలానే ఈ జ్ఞానాణువులుకూడా స్వయం భువత్వాన్ని కలిగి ఉన్నాయి.

జీవకణములో న్యూక్లియస్ రెండుగా ఆ రెండూ ఇంకా రెండుగా ఎలా విభజింపబడి విస్తృతమౌతున్నవో, విజ్ఞాన జిజ్ఞాసలుకూడా ఒకో అంశకణము మాదిరిగా విభజింపబడి పరిపూర్ణతను పొంది శాఖోపశాఖలుగా విభజింపబడుతున్నవి. జీవకణములోని క్రోమోజోమ్స్ అందలి జీన్స్‌లలోగల గతవంశానుగత భావాలు నిక్షిప్తమై ఎలా వాహకాలుగా ప్రయాణిస్తూ ప్రసారమౌతుంటాయో, విజ్ఞాన జిజ్ఞాసలలోని ఒకో అంశం తనపూర్వాపరాలను నిక్షిప్త పరచుకొని వాటిని గూఢంగా ప్రసారం చేస్తూనే ఉంటుంది. జీవి యొక్క జాతిని క్రోమోజోమ్స్ జతల సంఖ్య నిర్దేశించినట్లే, ఓ అంశములోని యోచనాణువులూ, భావాణువులూ వాటి నిష్పత్తిని బట్టి అంశం నిర్దేశింపబడుతుంది. జీవకణములు టిష్యూలుగానూ ఆ టిష్యూలు అవయవములుగానూ, ఆ అవయవములు సంపూర్ణ శరీరముగానూ రూపొందినట్లు, విజ్ఞాన జిజ్ఞాసలలోని అన్వేషణలోని కొన్ని జ్ఞానాణువులు కొన్ని అంశాలుగానూ, కొన్ని అంశాలు కొన్ని విషయాలుగానూ, కొన్ని విషయాలు ఓ శాస్త్రాంశముగానూ రూపొందుతుంది. జిజ్ఞాసా జగత్తులో పరిశీలించి చూస్తే, ఈ విశ్వంలో మూడు అణువులు ఉన్నాయి.

అవి : పదార్థ పరమాణువులూ, జీవ జీవాణువులూ, జిజ్ఞాసలోని జ్ఞానాణువులూ, అన్నవి ఈ విశ్వానికి అస్తిత్వమేమోననిపిస్తుంది. అందుకనే విజ్ఞాన జిజ్ఞాసలోని జ్ఞానకేంద్రకాన్ని విచ్ఛేదనము చేస్తే, మానవునిలోని విజ్ఞాన జిజ్ఞాసలు వినాశమై చివరికి మానవజాతే విచ్ఛిన్నమై లయ అస్తిత్వం మిగులుతుందేమోనన్పిస్తుంది తాత్విక వైజ్ఞానికతల దార్శనికతలో.

# Form IV (SEE RULE 8)

## Statement about ownership and other Particualrs of MISIMI

| | | | |
|---|---|---|---|
| 1 | Place of Publication | | 1-1-60/5, Iftekar Mansion Lane,<br>R T C. Cross Roads, Musheerabad,<br>Hyderabad - 500 020 A.P |
| 2 | Periodicity of its Publication | . | Monthly |
| 3 | Printer's Name | | ALAPATI BAPANNA |
| | Whether citizen of India | · | Yes |
| | If foreigners, state the country of origin | | |
| | Address | : | 1-1-60/5, Iftekar Mansion Lane,<br>R.T.C Cross Roads, Musheerabad,<br>Hyderabad - 500 020. A.P. |
| 4. | Publisher's Name | : | ALAPATI BAPANNA |
| | Whether citizen of India | | |
| | If foreigners, state the country of origin | | |
| | Address | : | 1-1-60/5, Iftekar Mansion Lane,<br>R.T.C Cross Roads, Musheerabad,<br>Hyderabad - 500 020 A.P. |
| 5. | Editor's Name | . | ANNAPA REDDY<br>VENKATESWARA REDDY |
| | Whether citizen of India | : | Yes |
| | If foreigners, state the country of origin | | |
| | Address | : | 1-1-60/5, Iftekar Mansion Lane,<br>R.T.C. Cross Roads, Musheerabad,<br>Hyderabad - 500 020. A.P. |
| 6. | Names and addresses of individuals who own the newspaper and partners or shareholders holding more than one percent of the total capital | : | ALAPATI BAPANNA<br>337-A, Road No. 10,<br>Jubilee Hills,<br>Hyderabad - 500 034 |

I, ALAPATI BAPANNA, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Sd/-
**ALAPATI BAPANNA**
Publisher

Date . March 1, 1999.